సాహితీమైత్రి సకలార్థ సాధకంబు।

హింది పండిట్
ప్రభుత్వ జూనియర్ కళాశాల,
హీరమండలం_532 459.

## అభినందన

గీతమాలిక : మధుర యనునట్టి కావ్యము మధురమైన
ధువిగ బొడగట్టె, నవ్యావతోరణంబు,
రక్తిదియకోవలూరు శ్రీరంగసామి
కావ్యమున్ వ్రాసెను వచన కవితలందు,
వ్యక్తమైనట్టి కవితల వన్నెలిందు
ముత్యములవోలె మదికింపు పొందుపరచు
కలతెలంగును జూపించి కలతదీర్చి
మధుర భావాలు పఠితల మనసులందు
నీటుగా నెలకొల్పు సాహితీ నేస్తియితడు
యశమునొందగ బెక్కు కావ్యాలు వ్రాసి
ముదిత హృదయుండునౌగాక! ముందుముందు॥

## ఆకాంక్ష

క॥ పది బిడ్డవాని కొడుకును
చదువున, సొమ్మున, బలమున చానలు ముగురన్
పదిలో నెనిమిది రూపుడు
పదిలముగా వీనికొసగు పలుభాగ్యములన్॥

1. శ్రీరాముడు
2. సరస్వతి, లక్ష్మి, పార్వతి
3. శ్రీకృష్ణుడు
4. పదిలముగా = దృఢముగా

ఇట్లు భవదీయ
సాహితీప్రియ బంధువు & మిత్రుడు
అద్దంకి రామానుజాచార్యులు
తేది 29-9-1985 దీ

# విపంచి

[వ్యాస సంపుటి]

## టి. శ్రీరంగస్వామి





సాహితీ సమితి

(రి.నెం. 289/84)

ఇ.నెం. 5-11-~~114/4~~ 481

హన్మకొండ-వరంగల్లు-1

1986

VIPANCHEE

(Essays on Free Varse Poetry)

T. SRI RANGA SWAMY



Titled by **PRASWAJI**

Publication No. 8

First Edition
1986 January

Price Rs. 4/-

For copies:
Srilekha Publications
5-11-114/4, Vidyaranyapuri
Warangal - 506 009

NATARAJ PRINTERS
Kashibugga, Warangal

# ప్రకాశకీయం

మా సంస్థ ప్రచురిస్తున్న పుస్తకాలలో ఇది ఎనిమిదవది. వ్యాస ప్రక్రియకు చెందిన వాటిలో ఇది రెండవది అవుతుంది. సంస్థ మొదటి ప్రచురణగ వారి కవితా సంపుటి "మధుర" ప్రచురింప బడినది. మొదటి వ్యాసం సంపుటి కూడా వారి సంపాద కత్వం లోనే వెలుగు చూసింది.

ఈ వ్యాస సంపుటి "విపంచి'' గురించి ఒకటీ, అర మాటలు చెప్పాలి ఇక్కడ సాహిత్యములోని లోతు పాతులు, మంచి చెడులు విశ్లేషించి ప్రజల ముందు ఉత్తమ సాహిత్యాన్ని ఉంచుటలో విమర్శకుల బాధ్యత ఎక్కువగా ఉంది. కాని సమ కాలీన సాహిత్యములో ఇది చాలా కొరవడింది. అసలే తెలుగులో విమర్శకులు తక్కువ. ఉన్నవారు పూర్వం విశ్లేషించ బడిన సాహిత్యాన్నే మళ్ళీ వస్తువుగా స్వీక రిస్తూ, వ్యాసాలు అందించడం మనకు కనిపిస్తుంది. ఈ ధోరణిలో సమ కాలీనుల కవిత్వము చాలా వరకు పుస్తక సమీక్షలతోనే ఆగిపోతుంది. ఆ లోపాన్ని ఈ పుస్తకము పూరిస్తుందని కాదు కాని, ఆ పూరణమునకు నాందిగా నిలుస్తుందనీ ఈ దారిలో సమకాలీన సాహితీ వేత్తల సాహిత్యాన్ని అంచనా వేసి విమర్శ గ్రంధాలు వస్తా యనే ఆశ మాకుంది. ఆ ఆశయే ఈ పుస్తకం సాహితీ సమితి, వరంగల్లు ద్వారా రావడానికి కారణ మైంది. మా సంస్థ ద్వారా దానిని వెలువ రించచమునకు అనుమతి ఇచ్చిన శ్రీ టి. శ్రీరంగస్వామి గారికి కృతజ్ఞతలు.

మా సాహితీ సేవలో తోడ్పడుతున్న మిత్రులు అందరికీ సకాలంలో ముద్రించిన నటరాజ్ ప్రెస్, వరంగల్లు గారికీ మా కృతజ్ఞతలు.

సాహితీ సమితి,
5-11-~~1141~~, విద్యారణ్యపురి,
వరంగల్లు

# ఆశంస - ఆశీస్సు

ఒక విషయాన్ని గురించి, ఆలోచించి తన అభిప్రాయాలను నలుగురికి చెప్పాలనేది ఒక చైతన్య లక్షణం. హర్షించదగిన ఈ లక్షణం గలవాడు చిరంజీవి టి. శ్రీరంగస్వామి. హనుమకొండ ఆ ప్రాంతంలో సాగే సాహిత్య కృషిలో, సాహిత్య కార్యక్రమాల్లో ఎంతో ఉత్సాహంగా ఈనాడు పాలుపంచుకొంటున్న క్రియాశీలి. వివిధమైన స్థానిక సాహిత్య సంస్థలతో గాఢమైన సంబంధం గల వాడాయన అంతే కాదు. ఉదీయమాన కవికూడా కొన్ని మెరుపుల వంటి ఊహలతో చక్కని 'మధుర' కవితా సంకలనం ఆ మధ్య వెలువరించి కవితాభిమానుల ఆదరాన్ని ప్రోత్సాహాన్నీ సంపాదించుకున్నాడు. మరింతగా సంపాదించుకొనే కృషిలో నిష్ఠగా ముందుకు సాగుతున్నాడు.

తాను సాగిస్తున్న సాహిత్య కృషిలో, తాను అధ్యయనం చేస్తున్న సాహిత్యంలో తన పరిధిలోకి వచ్చిన సాహిత్య వ్యక్తిత్వాలతో సాగిన ఆలోచన ఫలితంగా ఆయనకు కొన్ని కొన్ని అభిప్రాయాలు కలిగినయి. వాటిని చిన్న చిన్న వ్యాసాలుగా రూపొందించి ఈ 'విపంచి'ని సహృదయుల ముందుంచు తున్నాడు. ప్రస్తుత 'విపంచి' షట్తంత్రి ఇందులో ఒక్కొక్క తీగె ఒక్కొక్క వ్యాసంగా గొంతున్నిచ్చింది. ఈనాడు విస్తృతంగా కన్పిస్తున్న 'మినీ కవితా' విధానం, అసలు కవిత్వమెందుకు? అన్న ప్రశ్న కవితా విప్లవాల మధ్య వస్తున్న మలుపులు, ఈ సందర్భంలో రచయితల బాధ్యతలు-విలువలు, కవిత్వంలో వాస్తవికత; మానవతా సిద్ధాంతం-ఈ మొదలైన అంశాలు ఈనాడు సాహిత్యరంగంలో ప్రవేశించిన వారికి నిజంగానే ఆలోచించదగినవి. చి॥ శ్రీరంగస్వామి వాటిని గూర్చి ఆలోచించి, తన సాధన అవగాహనల మేరకు తన అభిప్రాయాలను ఈ ఆరు మినీ వాస్యాలలో, ఉదాహరణల బాహుళ్యంలో వ్యక్తం చేసాడు.

'మినీ' కవిత ఒక ఆయుధం లాంటిది. అయితే ఆయుధం, పట్టుకొన్న యోధుని మీద ఆధారపడి ఉంటుంది. దానిఉపయోగం అనే నిశ్చయం గల శ్రీరంగస్వామి విమర్శ వ్యాసాల విషయంలోనూ అదేవిధంగా ప్రవర్తిస్తున్నాడు. ఆయుధానికి పదను పెడుతున్నాడు. విమర్శలో శ్రీరంగస్వామి ప్రథమ ప్రయత్నం ఈ వ్యాస సంకలనం ఈ స్థితిని ప్రతి వ్యాసంలోనూ గమనించవచ్చు.

అయితే, మరింత సాధనతో అవగాహనతో స్పష్టతతో శ్రీరంగస్వామి ముందు ముందు చక్కని విమర్శ సాగించగలడనే ఈ వ్యాసాలు నాందీ ప్రస్తావనలు. మరి ఇంతటితోనే ఆగకుండా ఆ ఆశను సఫలం చేసేందుకు తగిన శక్తియుక్తులను సంపాదించుకొని తప్పకుండా ముందుకుసాగుతాడని ఆశిస్తూ, మొదటే చెప్పినట్టు, ఆయనలోని ఆ చైతన్య లక్షణాన్ని అభినందిస్తున్నాను. అభివృద్ధి దశలో సాగాలని ఆశీర్వదిస్తున్నాను.

రామన్నపేట,
వరంగల్.-2

మీ
డా॥ కోవెల సంపత్కుమారాచార్యులు

# ఆ కాం క్ష

ఒక నిర్దిష్టమైన దిశా, ఒక స్పష్టమైన దశా చేరుకోవలసిన సా హి త్య సా ధ కు డు చిరంజీవి టి. శ్రీరంగస్వామి. ఈయనకవిత్వంలో సాధన చేస్తు న్నాడు. తన చుట్టూ ఉన్న సాహిత్య స్వరూపాన్ని అధ్యయనం చేస్తున్నాడు. ఈ అధ్యయన ఫలమే ఈ "విపంచి".

తన సాహిత్య అనుభవానికి, వివేచన-పూర్వా పర సమాలోచలనలతో సమన్వయం చేయగలిగితే ఈయన చక్కని విమర్శకుడయ్యే అవకాశం ఉన్నది.

ఏ సాహిత్య సాధకునికైనా కావలసింది అధ్య యనము, పరిశీలన వీటితో పాటు సాధన ఉన్నట్లయితే అతనికి తన ప్రయత్నంలో సాఫల్యం చేరువలో ఉంటుంది.

శ్రీరంగస్వామికి అలా శ్రీసరస్వతి అనుగ్రహం వలన సాఫల్యం చేరువ కావాలని ఆశిస్తున్నాను.

వరంగల్లు-2. ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య

# ఆశంస

శ్రీ శ్రీరంగస్వామిగారూ!

మీరు అప్పుడప్పుడు వ్రాసిన వ్యాసాలను "విపంచి" వ్యాస సంపుటిగా వెలువరిస్తున్నందుకు సంతోషం. కవితా తత్వాన్ని లోతుగా విశ్లేషించే ప్రయత్నం కంటే సానుభూతితో సమీక్షించే గుణమే ఈ వ్యాసాల్లో కన్పిస్తూ వుంది. వచన కవిత్వంలో వెలువడుతున్న వర్తమాన వర్ధమాన కవితల గురించి మీరు వ్రాసిన వ్యాసాల్లో ఉదాహరించిన పంక్తులు కొన్ని పదునుగా ఉంటాయి. కొన్ని పలచనివీ ఉన్నాయి. ముందు ముందు వ్రాసే వ్యాసాలు మరింత దట్టంగా ఉంటాయని ఆశిస్తున్నాను.

హైదరాబాదు

మీ,

**ఆచార్య సి. నారాయణరెడ్డి**

ఉపాధ్యక్షులు

ఆం. ప్ర. సార్వత్రిక విశ్వవిద్యాలయం

# అభినందన

వీణానాదానికి శ్రవణేంద్రియాలు చైతన్యవంతమౌతాయి. సాహిత్య సౌరభాన్ని ఘ్రాణించే అక్షర ప్రియులను ఆనంది ప జేయు భావనా విపంచి మనోపథాన విహరించినా, మార్గాన్వేషణాక్రియలో వినోద క్రీడల ఏ వాడల తిరుగాడినా ప్రకృతి లక్ష్యాన్ని, ధర్మాన్ని సహజత్వాన్ని క్షణ క్షణమూ స్పందింప జేస్తుంటుంది.

ప్రజాస్వామ్యాన్ని ఆత్మగౌరవ సదృశంగా మలచే ప్రయత్నంలో కవితావతారాన్ని పలువిధాల ప్రదర్శిస్తున్న లబ్ధప్రతిష్ఠులైన కవుల జోలికి పోకుండా ఆయా కవుల పడకటింటి దిండ్లుగా భాసిస్తున్న స్కంధ గ్రంథాల్ని పర్వాల ప్రసన్నమైన సాహిత్య పర్వతాల్ని ముట్టుకోక నేటి వర్ధిష్ణుల కవితా రచన విధానాన్ని మినీ కవితా పథాన్ని మనకు పరిచయం చేసేందుకు శ్రీ టి. శ్రీరంగస్వామిగారి సంక్షిప్త వ్యాసాలు విపంచి పేటిక నిక్షిప్తం పరచడంలో కృతకృత్యులైనారు.

ఏ రూపంలో చూపినా కవితా రూప స్వరూపాన్ని విమర్శకుడు చూచి చూపించక వదిలిపెట్టడు ప్రస్తుత సమాజాన అస్తవ్యస్థ పరిస్థితుల్ని వాటి కావలంబకులైన పాలకుల్ని దుయ్యబడుతూ అధికార వ్యామోహాలను సైతం తృళ్ళింప జేయగల్గి కవితా శక్తిని వింగడింప జేయుట శ్రీ శ్రీరంగస్వామి గారి ప్రయత్నం శ్లాఘనీయమైనది.

మినీ కవులకు నచ్చని యీ కొత్త పద్ధతి ఆధునిక కవులకు జ్ఞాపకంగా విపంచి నిలుస్తుంది వ్యాస సంపుటి సవివరమైనట్టిదిగా భావించడం కూడా నేటి కవిత పరిణతి ననుసరించ తగదు గాబట్టి, శ్రీ టి. శ్రీరంగస్వామి ముందు ముందు సమగ్రంగా కవితా విమర్శన గ్రంథాన్ని వ్రాసి వెలువరించ గలందులకు 'విపంచి' తొలి నాదం యిది. అందుకే యీ నా అభినందన.

కవితా జ్వాల
శ్రీ "కాట్రగడ్డ"
ఏలూరు

## ఇందులో....

సనాతనులలో సనాతనుడై
సహృదయులతో సహృదయుడై
ఆర్తులకు ఆత్మీయుడై
సహృదయ కేదారనందనవనంలో
ఎందరికో హృదయ సౌరభాన్నందించిన
డా॥ రామక లక్ష్మణమూర్తి గారికి
ఆత్మీయంతో —
టి. శ్రీరంగస్వామి

# స్వకీయం

ఈ సంపుటిలో రాసిన వ్యాసాలుఅన్నీ ఈ సం॥లోనే రాసినవి. "కవితా విప్లవాల మధ్య ఓ మలుపు" అన్న వ్యాసం మాత్రం 1981లో రాసినది. నాకు వచన కవితా ప్రక్రియ మీద ఉన్న అవగాహనతో రాసినవి ఈ వ్యాసాలు. నేను సాధనలో ఉన్న వాడినే కాబట్టి ఇందులోని వ్యాసాలు అన్నీ ప్రామాణమునకు నిలుస్తాయని అనుకోవడం పొరపాటే అవుతుందని నేను భావిస్తున్నాను.

ఒక కొత్త మార్గాన్ని ఎన్నుకొని, ఆ మార్గంలో సమకాలీన రచయితల కవితలను కూడా ఇందులో ఉదాహరించడం జరిగింది. ఇప్పుడిప్పుడే కవితా ప్రపంచంలో విహారం చేస్తున్నవారు కూడా ఇందులో ఉన్నారు.

ఇందులోని వ్యాసాలను ప్రచురించిన పత్రికాధిపతులకు నా సాహితీ సేవలో అనవతరం అండగా నిలిచి, నన్ను ప్రోత్సాహిస్తున్న నా శ్రీమతి శ్రీలక్ష్మికి, బావగారు శ్రీ శ్రీధరస్వామి గారికి అమ్మా, నాన్నలకు కృతజ్ఞతాంజలులు.

నా సాహిత్య సేవలో ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకరిస్తున్న మిత్రులందరినీ ముఖ్యంగా ఎర్రా రాజమౌళి (పోస్ట్‌మెన్), విద్యారణ్యపురి తపాలా కార్యాలయము సిబ్బందిని గుర్తుచేసుకోక పోవడం తప్పే అవుతుంది.

ఈ వ్యాస సంపుటికి ఆశీస్సులు -ఆకాంక్షలు అందించిన నా పరోక్ష ఆత్మీయ, గురువర్యులు డా॥ సి నారాయణరెడ్డిగారు, డా॥ కోవెల సుప్రసన్నాచార్యులు గారు, డా॥ కోవెల సంపత్కుమారాచార్యులు గారికి ఆశావాది ప్రకాశరావు గారికి నా కృతజ్ఞతా క్రైమోడ్పులు నేను "విపంచి" వ్యాస సంపుటి తెస్తున్నాననగానే ఆత్మీయంతో అభినందన చందనాలు అందించిన మిత్రులకు కృతజ్ఞతలు కాక ఇంకేమి అందివ్వగలను.

ఈ పుస్తకానికి అందంగా అక్షరాల కూర్పును అందించిన మిత్రుడు శ్రీ ప్రస్వాజి గారికి నా నమస్సులు.

ఈ సంపుటి త్వరగా అచ్చులో పోసుకోవడానికి కారకులు అయిన శ్రీ సాంబ వరావుకు, నటరాజ్ ప్రింటర్స్, వరంగల్లు సిబ్బందికి కృతజ్ఞతలతో ..... .....

టి. శ్రీరంగస్వామి

# సాహిత్యంలో నూతన ప్రక్రియం - మినీ కవిత

సాహిత్యంలో నిత్యనూతనమైన మార్పులు వస్తూనే ఉంటాయి. ఆ మార్పులతో పాటు కొన్ని ప్రయోగాలు కూడా మనకు కనిపిస్తూనే ఉంటాయి. సఫలం అయిన ప్రయోగం కొంత ఫలితాన్ని ఇవ్వక మానదు. ఆ ఫలితం సఫలంగా మారి కొంత మందిలో మార్పు తెచ్చినపుడు ప్రతి మనిషిలో కొంత ఉత్సుకత కలుగక మానదు. ఆ ఉత్సుకత కొందరిలో చక్కటి మార్పుతెచ్చి కొంత కాలం మప్పుక తిరుగుతుంది. కొంత మందిలో అది తాత్కాలికంగానే ఓ వెలుగును వెలిగిస్తుంది. ఇలా వెలుగును ప్రసరింప చేసిన ప్రక్రియల్లో "మినీకవితా" ప్రక్రియ చెప్పుకోతగినది. మినీకవిత ద్వారా రోజు రోజుకు మారుతున్న సామాజిక పరిస్థితులతోను, సాంఘిక పరమైన వ్యవస్థ మీద తిరుగుబాటును ప్రదర్శిస్తూ, మారుతున్న జీవన వేగంతో పోటీపడుతూ యాంత్రిక మైన సగటు మానవుని ప్రగతి పథంలో అనుదినం శ్రవణానందం గావిస్తూ వచన కవిత నేడు "మినీకవిత"గా రూపుదిద్దుకొనదది, అంతేకాకుండా అది ప్రజల నాలుకలపై తేలియాడుతుంది.

వచన కవులలో చాలా మంది ఈ "మినీకవిత"కు ప్రభావితులై మినీకవితను "మినీ"గా చెప్పడమునకు ప్రాధాన్యతఇస్తూ కవితా వ్యవసాయం చేస్తున్నారు. ఈ ప్రాధాన్యత చేకూరడం వలననే నేడు మినీకవిత రాసే వాండ్లను అక్కసుతో "మినీ కవులు" అని ఈసడించు కొనేవారు చాలామంది మనకు గోచరిస్తుంటారు. వీరందరికి "మినీకవిత"ను చులకన చేయడం తగదు అని చెప్పీ చెప్పకుండానే కొంతమంది ఈ మినీ కవితను అల్లి దిగ్విజయం సాధించలేక పోవడం మనం గమనించ వచ్చు. ఏది ఏమైనప్పటికిని సాహితీ వనంలో మినీకవిత ప్రక్రియ ఈనాడు బహుళ ప్రాచుర్యం కలిగి ఉన్నదని చెప్ప వచ్చును. మినీ కవిత ఒక ఆయుధం లాంటిది. దీనికి రెండు వైపులా పదును ఉన్నటువంటిది. కుంభకర్ణులను సైతం ఒక సారి నిద్రావస్థనుండి చైతన్యావస్థకు తీసుకొని వస్తుందనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. "అల్పాక్షరాలలో అనల్పార్థరచన" అన్న నానుడికి నిదర్శనంగా నిలచుకొని మన ముందు నిలబడింది.

ఈ మినీ కవితను హ్రస్వ కవితనీ, సోడామినీ కవితనీ, మెరుపుకవితనీ పిలువడం కూడా జరుగుతుంది. మెరుపు కవిత అనడంలో ఎంతో ఔచిత్యం వుంది. ఎందుకంటే అది పాఠకుడి మనస్సులో మెరుస్తుంది. కంట్లో జిగేలుమనిపిస్తుంది. ఉపమ

తుంది, గుండె ఝల్లుమనిపిస్తుంది, పాఠకుడిని ఆలోచనా నిమగ్నుడిగానూ చేస్తుంది' మినీ కవిత అమృత గుళికలలా ఉండి రోగగ్రస్త సమాజ గళంలో పడి ఆరోగ్యాన్ని ప్రసాదించే "అశ్విని"లా కనిపిస్తుంది. అందుకే "కవి" గురించి ఆచార్య భావన్‌గారు చెప్పిన ఈ పంక్తుల్ని చూడవచ్చు.

'అక్షరాల్ని జీవితాలతో
కలిపి కుట్టే వాడే కవి
లిపికి జీవన
వూపిరులూదే వాడే కవి' అని

అంతే కాకుండా ఈ మినీ కవితలో పాఠకుల హృదయాలలో 'సూర్యోజ్వలనం అవుతుంది అని శ్రీ "కాట్రగడ్డ'' గారంటారు.

''వేల సూర్యుళ్ళ మాలకట్టి
వేడి వెలుగుల వేడుకలలో
వేల సూర్యులు నింగి తడితే
నాడులన్నీ సిగిడి చూస్తాయి
తూగు చంద్రుడు చిందులేస్తూ
ఊగు ఊయల లోకమందున
వాగులందున వరదలందున
వేగులాగా తొంగి చూస్తాడు"

పాఠకుల హృదయంలో కొన్ని మినీ కవితలు శాశ్వతంగా ముద్రవేసుకుంటాయి. అవి నిరంతరం అతని మనస్సులో చోటు చేసుకుంటాయి. అయితే మినీ కవిత పేరుతో కొంత మంది తాము రాసిందంతా ''మినీ కవితే'' అని అంటున్నారు. ఇవి కేవలం నినాదాలుగానే మిగిలి పోతాయి. ఈ విషయం మనకు మినీ కవిత ప్రక్రియలో స్పష్టంగా ప్రతిబింబిస్తుంది. మినీ కవిత ఒక ఆయుధం లాంటిది అయితే ఆ ఆయుధం పట్టుకున్న యోధుడి మీద ఆధారపడి ఉంటుంది దాని వినియోగం.

మినీ కవితలుగా వస్తున్న కవితలను పరిశీలిస్తే మనం వాటిని ఈ క్రింది రకాలుగా విభజించుకోవచ్చును.

రెక్కలు విప్పుకున్న రొమాంటిసిజమ్ కవితలు,
భావ అస్పష్టత గల కవితలు,
భక్తి గీతాలు,
నిరాశవాద కవితలు,
ప్రగాఢమైన భావుకతకలవి,

వేదాంత నాదాలు.... మొదలగునవి కాబట్టి ఈ రూపంలో వెలువడిన కవితలన్నీ ఆరోగ్యవంతమైన కవితలని అనకూడదు. మినీ కవిత అనగానే ప్రకటనలలాగా వాక్యాలు రాసి, వాటిని మినీ కవిత అని అనుకోమని దబాయించే వారు కూడా లేక పోలేదు. ఇక్కడ ఉదాహరణకు ఇలాంటి కవితలను చెప్పుకోవచ్చును.

''పేదలకు పట్టాలివ్వాలి
రిక్షా కార్మికులకు రిక్షాలివ్వాలి
20 అంశాల కార్యక్రమాన్ని అమలు చేయాలి"

అని రాసి మినీ కవితే అంటే చెల్లుబాటుకాదు ఇలా కవితలు రాసే వారిని దృష్టిలో ఉంచుకొనే కాబోలు అహం అనే మినీ కవితలో శ్రీ శీలం రాజేశం గారు ఇలా అన్నారనుకుంటాను.

''కోయిల కుహూ! రావం ముందు
పిచ్చుకల కలవరమారావం
సాహితీ స్రష్టల సమీరం ముందు
ఇసుక తిన్నె హిమాలయంబగునే''

కాబట్టి ''మినీకవిత'' ను బహు జాగ్రత్తగా ఆలోచించి భావస్ఫూర్తితో, అర్థ వంతంగా అల్లి మనకు అందించాలి.

ఈ నాటి యాంత్రిక జీవనం మనకు తీరిగ్గా కూర్చొని పేజీలకు పేజీలు చదివి జీర్ణము చేసుకునే ఓపిక సమయములేని వారికి ఇది చలివేంద్రముగానూ, రిలీఫ్ ఇచ్చే విధముగానూ ఉంది. సామాన్యంగా మినీ కవితలో అర్థము కానిదంటూ ఉండదు. అలాగే అస్పష్టత కూడా ఉండదు.

"నేడు
ఓటుకై అర్థించే
అభ్యర్థి
రేపు
పీటనెక్కి అర్దరిచ్చే
అధికారి''

శీర్షిక —"రాజకీయవేత్త" శ్రీ నమిలికొండ బాలకిషన్ రావు

"అ, ఆ....లు
రానివాళ్ళు సైతం
అమాత్యులై పోతున్నప్పుడు
బడి పంతులు పోస్టుకు
చదువుకువోన్నెందుకు?"

శీర్షిక_"నిరక్షరాస్యత జిందాబాద్" -శ్రీ శ్రీదాస్యం లక్ష్మయ్య

"ముండమోసిన బ్రహ్మచారులం
మేం
మాకు
వృద్ధ కన్యలవసరంలేదు
టీనేజ్
కన్యలే కావాలి
మా పురుషత్వం
మీకనవసరం"

శీర్షిక_"పురుషసామ్యం" _టి. శ్రీరంగస్వామి

వ్యంగం ప్రధానాంశంగా ఉండి పాఠకుని మనస్సులో వెను వెంటనే సూటిగా దిగబడుతుంది. అందులోని భావస్ఫూర్తిని సులువుగా అందుకుంటాడని చెప్పవచ్చును.

మినీ కవితా ప్రక్రియలో ఇంకొక సుగుణము ఉంది కవి తనూహించిన భావాన్ని కొద్ది పదాలలో ఇమిడ్చి అందించడం వలన పాఠకులు తొందరగాను, కొద్ది కాలంలోనే కవి ఊహించిన భావ చైతన్యంలో ఇమడి పోవడానికి అవకాశము ఉంది కాబట్టి ఈ మినీ కవితను చదువు కొనడానికి ఉద్యమిస్తున్నాడు.

"అధికారంతో
ఫైళ్ళలో నిద్రిస్తే....
ఫైళ్ళే పాములై
కాటేస్తాయని
తెలియదు కాబోలు ..."

శీర్షిక_"అధికారి" -శ్రీ నమిలికొండ బాలకిషన్‌రావు

'రగిలే నా హృదయ గుండంలో
చెలరేగే భావనావిస్ఫు లింగాలలో
పరిక్రమించే కవితా కాంతులలో
ఈ విశ్వం కనపడుతున్నది
ఈ సృష్టిస్వరం విన పడుతున్నది"-

శీర్షిక-''విశ్వదర్శనం'' -శ్రీ ఆచార్యభావన్

ఈ కవితలో వ్యంగం స్పష్టంగా ఉన్నప్పటికిని, ధ్వని ప్రధానంగా ఉన్నా యని చెప్పక తప్పదు, మినీ కవితలో ఇంకొకరకమైన పరిశీలనతో కవితలు అల్లడం మరియొక సత్ లక్షణం. ఈ లక్షణమునకు ఉదాహరణగా వచ్చిన కవితలను చూస్తే మనకు సులభంగా తెలుస్తుంది.

''అమ్మాయి పెండ్లికి....
అసలడగద్దు కట్నం....
అబ్బాయి పెండ్లికి....
ముహూర్తానికే అందించాలి
మొత్తం''

శీర్షిక 'తనకు మాలని ధర్మం' - భండారు విజయ

''నా పొట్టకైతే
ఏ పనైనా
సమాపకం
నీపొట్టకైతే
ఏ పనైనా
అసమాపకం''

శీర్షిక ''క్రియాద్వయం'' శ్రీ- పి. మోహన్

మినీ కవితలలో ఎన్నో మంచి కవితలు ఈనాడు వస్తున్నాయ్, ఈ ప్రక్రియ సాహిత్య లోకమునకు అందించిన తదుపరి ఎంతోమంది కవులు కూడా పరిచయం అయ్యారు. మినీ కవితా ప్రక్రియతో "మెనీ" కవులు ఉద్భవించారు అనుటలో ఏమాత్రం సందేహం లేదు. వారు నిలదొక్కుకుంటారా లేదా అనేది వారి సృజ నాత్మకతను బట్టేకాని కేవలం మినీ కవితమీద ఉన్న చిన్నచూపుతో ఆ కవిత్వంను సృష్టిస్తున్న కవులను కించపరచడం తగదు. ఏ ప్రక్రియనైనా స్వాగతం పలుకడం మంచిది.

# కవిత్వం ఏది ఎందుకు?

కవిత్వం ఏది? అనుకొనే ముందు కవిత్వం ఎందుకు? అనుకొంటే ఇది జీవితం ఎందుకు అన్నంత సున్నితమైన ప్రశ్న. ఆలోచనాపరులను, రసానందం పొందే వారిని నిరంతరం ఎదురుకొనే ప్రశ్న ఇది, కవిత్వం అంటే ఏమిటో తెలుసుకో గలిగినచో ఇది సులభంగా అర్థమవుతుంది.

"అగ్ని జల్లినా అమృతం కురిసినా
అందం ఆనందం దాని పరమావధి" – అని

బాలగంగాధర్ తిలక్ కవిత్వం గురించి తనకున్న అవగాహనను వ్యక్తం చేస్తాడు. కవితా ప్రక్రియ చేపట్టిన ప్రతివాడూ తన ఆనందం కోసమో, ఆత్మానుభూతి కొరకో రాస్తుంటాడు.

కవిత్వం అందంగా ఉండాలనటం, ఆనందం ఇవ్వాలనడం భావ కవుల అవ గాహన అభ్యుదయ కవుల కవిత్వం నుంచి ఆనందాన్ని కాక, ఉత్తేజాన్ని ఆశించినారు ప్రస్తుతం అభ్యుదయ కవులు అని చెప్పుకుంటున్న కవులు సామాజిక చైతన్యం కొరకు పోరాడుతున్నామని అంటున్నారు.

ప్రస్తుతం వస్తున్న కవిత్వం చదివినప్పుడు ఈ కవిత్వం ఎందు కొరకు రాస్తు న్నారు? ఎవరి కొరకు రాస్తున్నారు? వీరు ఏ అవగాహనతో రాస్తున్నారు అనే ప్రశ్నలు ఉదయించక మానవు.

కవిత్వం రాసే వారిని నువ్వెందుకు కవిత్వం రాస్తున్నావు అని అంటే ఏమి చెప్పుతాడో ఆలోచిద్దాం, ఒకరి మొఖం వెలవెలాపోతుంది, ఇంకొకటు తమ ఆత్మానందం కోసమంటే, మరొకరు తమ అనుభూతిని వ్యక్త పరచుకోవడానికి అంటే ఇంకొక గడుసువాడు దేశాన్ని ఉద్ధరించడం కోసమంటాడు. ఏది ఏమైనప్పటికిని కవిత్వం కవితను అనుభవించిన రసానందాన్ని ఇతరులకు అందించటానికి అని చెప్పవచ్చును సూక్ష్మంగా

"అబద్ధాలాడడమంత సులభం అవదు సుమా కవిత అల్లడం, అయితే హరి శ్చంద్రుడనంతగా అలమటించనక్కరలేదు కావ్యకల్పనకు" కవిత్వం అల్లడానికి చిత్త నైర్మల్యం అవసరం అనేది ఒప్పుకోక తప్పదు కవిత అల్లడానికి కొంత మధనం తప్పదు. కవిత్వంలో ఆశించే రసాన్ని బట్టి, ప్రయోజనమును బట్టి, లక్ష్యాన్ని బట్టి ఆ కవిత యొక్క స్థాయి ఉంటుంది,



టి. రంగస్వామి

ఈ మధ్య కాలంలో వస్తున్న కవితలను చూసినప్పుడు కవిత్వం ఎందుకు రాస్తున్నారు. కవిత్వం అంటే ఇంతేనా అనే అభిప్రాయాలు సందేహాలు రాకమానవు ఈ సందర్భంలో రాచమల్లు రామచంద్రా రెడ్డి గారు మిణుగురులు అనే కవితా సంపుటి రాసిన ముందుమాటను మనం మననం చేసుకోవాల్సి ఉంటుంది. ''తెలుగు కవిత్వానికి చెడ్డకాలం దాపురించింది అభ్యుదయం పేరుతో కవిత్వంలో ప్రవేశించిన రాజకీయాలు ఏకుమేకైనట్లు కవిత్వాన్ని హతమార్చి, తామే కవిత్వంగా ఊరేగుతున్నాయి" ఇంతకూ, కవిత్వమంటే ఏమిటి చదివినప్పుడు నీకు హృదయం ద్రవిస్తే, లేదా కండ్లు చెమరిస్తే లేదా కడుపు మండితే ఒళ్ళు పులకరిస్తే వెన్ను జలదరిస్తే అది కవిత్వమని చాలా మందికి తెలుసు కాని చాలా మందికి తెలియనిదేమిటంటే ఉత్తమ కవిత్వానికి గీటురాయి ఆవేశబలం కాదు, అనుభూతి సౌకుమార్యం ఈ విషయం తెలియడమే ఒక సంస్కార విశేషం. ఈ సంస్కారం ఉన్న వాళ్ళే మంచి కవిత్వం రాస్తాడు లేదా తపనకు గురి అవుతారు. ఈ విషయంలో డా॥ కె.కె రంగనాథాచార్యులు గారి వ్యాసం ''ఆధునిక సాహిత్య విమర్శలో భావ పలాయన వాదధోరణులు" చూడండి విషకరణకులీ

కవిత్వమంటే ఏమిటన్న ప్రశ్న గురించి ఉద్భవించిన ధోరణి కాల్పనికమైనది దానిని ఇలా చెప్పుకోవచ్చును.

పరివర్తనాస్వభావం గల వస్తువులో వచ్చే జీవమంతమైన, నవ్యమైన సృష్టి ఇందుకుదాహరణంగా

''జయచంద్రుని
వారసులెందరు ఉన్నా
బుద్ధి గట్టిగా చెప్పగలం;
మా భూమిలో మేము బ్రతుక గలం
మువ్వన్నె పతాక నీడలో
మా సమైక్యతనే చాటగలం
—శీలం రాజేశం – ''భూతలమానికం''

ఈ విశాల విశ్వంలోనే
నిలువ చోటు లేదనా
ఈ ధరలు
ఆకాశంలోని
తారల కోసం
ఆరాటపడుతున్నది
—శ్రీ శ్రీదాస్యం లక్ష్మయ్య – 'చోటు'
(భావచిత్రాలు కవితా సంపుటి)

పరివర్తనం పొందని వస్తువులో మన చూపు చూసే, ఆలోచన చేసే క్రొత్త దనం—ఆ స్వభావలక్షణం ఇందుకుదాహరణగా

చేరిన ఆకలిని
చాలని కంబళిని
మాసిన డొక్కలని
పదిలంగా వదిలింది 'ఆత్మ'

—శ్రీ నమిలికొండ బాలకిషన్ రావు - 'ఆత్మ'
(యువస్వరం కవితా సంపుటి)

ఆ వెలుగు దివ్వె సిలా ఇవ్వు
ఈ నిశీధిని అంతం చేస్తాను
నా భావాలన్నీ ఇమిడ్చి
అందిస్తున్నాను ఈ పువ్వు
నీ అనుభూతుల్ని అందించు
లోకంలో నిండిన చీకటి రాత్రుల్ని పారద్రోలుతాను

—శ్రీ టి. నరేందర్ - 'వెలుగు'

"ఈ సాహిత్యం
ఈ సంస్థ
మీ అందరిదీ....
కాని
ఈ సంస్థ పదవి
నాకు మాత్రమే
పరిమితం"

—శ్రీ టి. శ్రీరంగస్వామి - సాహిత్యోన్ముఖుడు
(మధుర కవితా సంపుటి)

మనస్సు చేసే ఊహకూ, పొందే అక్షరాకృతికి సంబంధం పరివర్తనం అనేది ప్రకృతి స్వభావం ఇది జీవితంలో జీవశక్తి వికాసానికి, ఆలోచనకూ హేతువైంది ప్రకృతి నుండి కవిత్వానికి కవిత్వం నుండి జీవితానికి అర్ధాంతరం ప్రసార మాన మౌతుంది ఇందుకుదాహరణగా—

సూర్యుడు ప్రకృతిని
వికసింప చేసినట్లు
ఆశ భవిష్యత్తుని
వెలిగిస్తుంది
వికసించటం వెలగటం
రెండూ చైతన్యానికి చిహ్నాలే

—ఆచార్యభావన్ – "జీవితం సూర్యుడు"
(కెరటం నా ఆదర్శం కవితా సంపుటి)

రాసే కలానికి
ప్రశ్నలు జీవితశ్లేషలు
కాలానికి మెట్లు
ఆశలకు రూపాలు

–శ్రీపతి రమామురళీధర్ – చరిత్ర పుటలు

బజారులో విక్రయించిన
పశువుపై ....
అధికారం
మాదికాదు
ధర చెల్లించిన వారిదే ...!

–కుమారి భండారు విజయ – సందేశం
(దీపిక కవితా సంపుటి)

పై కవితలలో కవులు తాము కవిత్వం రాసే ముందు ఏ విధంగా అనుభూతిని పొందారో ఆ అనుభూతిని చక్కని ధ్వనిలో తమ కలం నుండి అందించడానికి ప్రయత్నం చేసారు. కవిత్వంలో కేవలం అనుభూతి మాత్రమే ప్రాధాన్యం వహించదు భాష మొదటి స్థానం వహిస్తుంది. ఈ మధ్య ఒక వాదం వినిపిస్తున్నది. అది ఏమిటంటే అంటే నీకు వచ్చిన భావాలను, నీకు ఎలావస్తే అలా రాసేయ్ అని. దీని వలన ఆ కవులు భాషపైన అధికారం సంపాదించు కోకుండా వారు రాసిన కవిత్వం బాగుందనగానే పొంగి పోయి తోచిందల్లా రాసేసి దాన్ని కవిత్వం అని అంటున్నారు, దబాయిస్తున్నారు అంతేకాదు ఇతరులకు కూడా సలహాలను అందిస్తుంటారు. ఈ విధంగా వచ్చిన కవిత్వం చదవినప్పుడు సహృదయుడైన విమర్శకుడికి కవిత్వం ఎందుకు? ఎవరికొరకు అనే ప్రశ్న ఉదయించక మానదు అంతే కాదు కవిత్వం అంటే అసంతృప్తి కూడా

ఏర్పడుతుంది, వీళ్ళను మనం అడుగుతే ఈ విధముగా సమాధానం ఇస్తారు. అవి శ్రీరంగం నారాయణ బాబు తన ప్రవద లో చెప్పిప ఈ మాటల్ని ఉదాహరించడం సబబుగా ఉంటుంది వ్యక్తా వ్యక్తంలో ఉత కొడతాము ఏదో విధమైన శక్తి మమ్మల్ని పూనుతుంది అదేవో రాయిస్తుంది అర్థమనర్థం అనేది రాయిస్తే అది కవిత్వం అని ఇక ఈ రచయితలు రాసిన కవిత్వం ఎలా వుంటుందో చూడండి.

''నాకు కొడుకు పోయాడు
మరింకొకడు పుట్టాడు
నీకు భర్త పోయాడు
అయినా....
మరో భర్త దొరికాడు
నీకు నిండు జీవితం ముందుంది
మళ్ళ పిల్లలు పుడుతారు"

ఇలాంటి కవిత్వం మనం చదివినప్పుడు ''కవిత్వం అంటే ఇంతేనా?" అనే చులకనభావం మనలో ఏర్పడడంలో ఏ మాత్రం తప్పులేదు!

అందుకొరకు కవిత్వం రాసే ముందు తను పొందిన అనుభూతిలో గాఢంగా పరితప్తుడై భావమునకు తగిన భాషతో కవిత్వంను అందించినపుడు ఆ కవిత రాణిస్తుంది పదిమంది నాలుకలలో తేలియాడుతుంది. కవిత్వం మీద గౌరవ భావం ఏర్పడుతుంది తాను ఎంత గాఢమైన అనుభూతిని పొందినా అందులో కొంతైనా మనకు అందక పోతే అతని మాటలు కవిత్వం కాలేవు అతన్ని "కవి" అని అనవలసిన అవసరంలేదు.

# కవితా విప్లవాల మధ్య ఓ మలుపు

అభ్యుదయ కవిత్వం తెలుగులో ప్రభవించిన తొలి కాలాన "పాడెమీదకెక్కిన సామ్రాజ్య వాదానికి పోరాటంలో తప్ప చరమ గీతం పాడలేం'' అని వరవరరావుగారు తమ స్వేచ్ఛ కావ్యములో కవితా విప్లవాలను ఓ కొత్త మలుపుకు తీసికొని వచ్చినారు. కాల్పనికత నుండి భావుకతావాదానికి స్వస్తి చెప్తూ వచన కవిత్వం ఒక ఉద్యమ స్వరూపంతో 1965లో మన ముందుకువచ్చి, 1950 నుండి 1966 వరకు వచ్చిన అభ్యుదయ కవిత్వానికి ఓ రూపంటూ లేకుండా తుడుచుకు పోయింది.

ఈ సాహిత్య శతాబ్దంలో 1965 నుండి 1975 సంవత్సరముల మధ్య వచ్చిన కవిత్వం ఆటు పోటులతో తీవ్రమైన మార్పులకు గురి అయింది. ఈ సమయంలోనే "విరసం'' ఏర్పడింది. విప్లవ రచయితలు పీడుతుల్ని తిరగ బడేవార్ని, పోరాడేవార్ని తమ ప్రజలుగా ఎన్నుకున్నారు.

"ఏటికెదురీది'' లక్ష్యం చేరుకోపడం మన స్వభావం కాబట్టి కష్టాలను పోరాటంతో అధిగమించడం మన కర్తవ్యం భవిష్యత్తు ఉజ్వలంగా ఉన్నది అనే భావంతో ఏకీభవించి

చరిత్ర ప్రసవిస్తున్నది
విప్లవం ఈ యుగశిశువు అంటూ విప్లవ రచయితలు తమ

కావ్యరచనలను ప్రారంభించారు అనడంలో సందేహంలేదు.

ఆ ప్రాంతంలోనే వచ్చిన 'లోచన్' కవిత 'ట్రిగ్గర్ పై వేలుంచి' అనునది విప్లవ కవితకు నాంది కవితగా చెప్పుకో వచ్చును. ఈ కవిత చోటు చేసుకున్న కవితా సంకలనం 'తిరుగబడు' మొదటి సంకలనంగానే భావించ వచ్చును.

ఈ సమయంలో వచ్చిన కవితా సంకలనం "కొక్కొరోకో", అగ్నిమిత్ర సంపాదకత్వంలో వచ్చిన కవితా సంకలనం దిగంబర కవులు, సి. వి. (సి.విజయలక్ష్మి) అద్దేపల్లి ప్రభృతులు సమాజంలోని సర్వసామాన్యమైన ఆత్మవంచనని అసహ్యించుకుంటూ కవితలు వెలువరించినదుంకట్టి పరిశ్రమించారు. రచయితల కర్తవ్యం ఏమిటని? ప్రశ్నించారు

''వేదాంతులు జీవితాన్ని, ప్రకృతి అవగాహన చేసుకున్నారు. మేం లోకాన్నీ జీవితాన్నీ ప్రకృతినీ కూడా మారుస్తాము" అని శ్రీరంగం నారాయణబాబుగారన్నటుల వారు సృజించిన కవితలలోని వస్తువులో కవితలో ఉంది. శ్రీరంగం నారాయణబాబు

తెలుగులో భీభత్స కవిత్వానికి అంకురార్పణ చేసి ముప్పయి సంవత్సరాలు అయిపో యింది. మళ్ళీ ఈ భీభత్సం దిగంబర కవుల కవితల్లో అగుపడుతుంది. దిగంబరత్వ మంటే శారీరక నగ్నత కాదు, దిగంబరత్వమంటే...... ....

"మనిషిలో అట్టడుగున బురద గుంటల్లో
పడివున్న మనిషిని లేవదీయడం
ఎముకల లోతుల్లో ధ్వనించే
స్వచ్ఛమైన గీతాల్ని ప్రతిధ్వనించడం
కళ్ళవెనక దాగియున్న
సిసలైన కన్నీళ్ళని ప్రసరించడం
....నిజాన్ని నిజంగా నగ్నంగా చెప్పడం". వారి ఉద్దేశం

ప్రజలు అవిద్యని, అజ్ఞానాన్ని, అశక్తతని ఆసరాగా తీసుకుని దేశాన్ని దోచు కుని తినడం మరగిన పరిపాలకులు సంఘంలోని వివిధ వర్గాల వాళ్ళు నేడు ప్రజలపై రుద్దుతున్న కుష్ఠి వ్యవస్థను ఎదురుకుంటూ దిగంబర కవులు "దిగంబర కవిత" ను మూడు సంపుటాలుగా వెలువరించి శిఖరాగ్రానికి తీసుకొని వెళ్ళినారు. చెవులుంటే విను, కళ్ళుంటే చూడు, మెదడుంటే ఆలోచించు, పసవుంటే అంటే చీమూ నెత్తురూవంటి నీతి, నిజాయితీ వుంటే దేశమంతటా రాజకీయనాయకులు పెద్దపెద్ద బొజ్జలు గొప్పగొప్ప ప్రజారక్త వ్యాపారులు, పదవి కోసం డబ్బుకోసం, దేనికైనా తెగించే మహాత్ములు, జాతి రక్తనాళాల నిండా మహమ్మారిలా వ్యాపింప చేస్తున్న ఒక కుష్ఠువ్యవస్థని నాశనం చేయడానికి బయటికి రమ్మని తాము నిర్మించిన దిగంబర శకంలోంచి జ్వాలాముఖి, చెరబండరాజు, భైరవయ్య, మహాస్వప్న, నగ్నముని మరియు నిఖిలేశ్వర్ లు (దిగంబర కవులు)

అయితే వీరు కవితా రీతులలో అన్నీ దాదాపు ఒకే అసమర్థత స్థాయిలో తెలుగు కవిత్వ రంగంలో ఎదురవుతూ, ఏవీ జీవిత వాస్తవికతను పట్టుకోలేక పోయిన దుస్థితి ఏర్పడినప్పుడు వచ్చిన తిరుగుబాటే దిగంబర కవుల కవిత.

ఈ సంకలనాలకు అటు, ఇటుగా అభ్యుదయ కవిత్వం పీడ విరుగడ అయింది అనుకునే వాండ్లకు ఉలికిపాటు కలిగించే విధముగా అభ్యుదయ కవిత్వం పుట్టిలో పుట్టి, మట్టిలో గిట్టే మూన్నాళ్ళ ముచ్చట కాదని నిరూపించే విధముగా సి. విజయ లక్ష్మి విషాద భారతం కావ్యావతరణ జరిగింది. ఈ కావ్యానికి వస్తువు ప్రస్తుతం మన దేశంలో జరుగుతున్న కపట నాటకం ఇతివృత్తం.

శ్రీ కె.వి. రమణారెడ్డి గారన్నట్టు ఈ కావ్యంలో "పూవుల్లేవు, తావుల్లేవు, సంజల్లేవు, సంగీతాల్లేవు, నగిషీల్లేవు, నాణాలు లేవు, భాషాటోపాల్లేవు, అలంకారాల కుచ్చుల టోపీల్లేవు అయినా కవిత్వం ఉంది. హృదయ నిర్వంత్వం కవిత్వానికి ద్రవ్యం. మాటలూ మాటల కూర్పులూ, గణాలూ, మాత్రలూ—ఇవన్నీ ఉపాంగాలు మాత్రమే" అని అంటారు.

"కవిత సరిహద్దుల్ని నిర్ధరించటం
గగన పరిధిని స్కేలు బద్దతో కొలువ ప్రయత్నించడం"

అని సి. విజయలక్ష్మిగారు వారి ఎనిమిది పర్వాల కావ్యం "విషాద భారతం"లో అంటున్నారు. ఈ కావ్యం చదువుతుంటే మన దేశం, మన కాలం కళ్ళకు కట్టినట్లు కనబడుతుంది. దేశంలో పెచ్చరిల్లి పోతున్న నిరంకుశ ధోరణులు ఓట్ల పండుగలో జరిగే దగాలూ, దౌర్జన్యాలూ, కొండెక్కుతున్న జీవన సౌభాగ్యాలను ఎగసనదోసే తెన్నుగానక తిరుపతులకూ, అన్నవరాలకూ, పుట్టపర్తులకూ చేస్తున్న యాత్రలు డబ్బు కక్కుర్తికి పౌరసత్వాన్ని అమ్ముకోవలసి వస్తున్న వైపరీత్యాలూ, విషాదం మూర్తీభవించిన భారతదేశం ప్రత్యక్ష మౌతూన్నది అసభ్యాలనీ, పర్యాయపదాలనుకొనే పదాలను కూడా నోటపెట్టించింది ఈ కావ్యకర్త చేత ఈ విధంగా

"నల్లమందు లాంటి, గంజాయి దమ్ము లాంటి
భంగు నిషా లాంటి, సారా కైపు లాంటి
చేతబడి లాంటి, దయ్యం భయం లాంటి
గాఢ సుషుప్తి లాంటి, మూఢ మత విశ్వాసం లాంటి
నేటి నిస్తేజ నిర్వీర్య ఉదాసీన చైతన్య శూన్య
నిర్లిప్తతలనుండి తిరిగి మేలుకొండి" అని మనకు మేల్కొల్పుతున్నారు

"ప్రతిపక్షశక్తుల్ని చెండాడి ప్రగతిని పరిరక్షించేందుకోసం
ప్రళయ రుద్రుని లాంటి నరుడు తెరుస్తాడు కవిత నేత్రం"

అని సూక్ష్మంగా కవిత్వ ధ్యేయాన్ని వ్యక్త పరిచాడు. అతి సూక్ష్మ విషయాల పట్ల కూడా ఎంతో పరిశీలనాత్మక విమర్శ చేయడం వీరి కావ్యంలో మనకు అడుగడుగునా కనిపిస్తుంది. ఇందులో కుహనా సంస్కారవంతులకే, మర్యాదస్థులకే మాత్రం మర్యాద ఇవ్వలేదని నిస్సంకోచంగా చెప్పవచ్చును.

ఈ సందర్భములో అద్దేపల్లి రామమోహనరావు "మన సమాజంలో ముందు బాగు పడాల్సింది మనిషి, మనిషి తనలోని చైతన్య విస్తృతిని సమాజ క్షేమం వైపు మళ్ళించాలి, సమాజ మంటే తనలాంటి వ్యక్తుల సమూహమని గ్రహించాలి. డబ్బు కంటే ప్రధానమైనది హృదయమని తెలుసుకోవాలి. గుండెలో నుండి చైతన్యపు లోతుల్లో నుండి సమాజాన్ని మార్చగలనని భావించాలి" అని తమ 'అంతర్ జ్వాల' లో ఉద్ఘాటించారు.

'సమాజంలో నిరంతరం సమస్యల రూపంగా మండుతున్న జ్వాల' అని అంటూనే ... ....

'మన గుండె తిన్నింటి నడుమ నుండి
ఒక నూతన సంకల్పాన్ని గుచ్చి
అగ్నిజ్వాలా మాలికను గూర్చి
మన చుట్టూ కమ్ముకొచ్చే చీకట్లను దహిద్దాం రండి
సమానం అయిన నవ వినూతన
సమాజాన్ని నిర్మిద్దాం రండి' అని ఆహ్వానిస్తున్నారు.

ఈ మార్పులో నుండి చైతన్యవంతులై ఉద్భవించిన యువకవులు ఎందరో మనకు కన్పిస్తారు. ఆ మార్పుకు రసప్లావితులై, తన కవితా గళం నుండి స్రవింప చేసిన యువకవి 'ఏధీ' కవితలు కూడా ఒక మారు చూద్దాం.

'ప్రజల్లో నేనై నేనే ప్రజనై
నాలో ప్రజలై ప్రజా గొంతుకలో నా కవితయై
ఏకదళంగా కదిలి ఏకవర్గ సమాజ
నిర్మాణ నిర్ణీతలయ్యే వరకూ,
ప్రతి హృదయాన్ని కరిగించి
నేర్పుతుంది విప్లవ నియామనియత
నా కవిత మండే అభ్యుదయ అగ్ని కూడిక
అందులో ప్రతి కణము పరుగిడే విప్లవ జ్వాల'

అంతే కాదు ఆ కవిత ఎలా రావాలో కూడా చెప్పుతున్నారు.

"దోపిడివి హతమార్చి
మనిషిని హర్చ

కావాలి నవ కవిత,
రావాలి నవ కవిత
కుమిలే గుండెను
సమరానికి తరలించ''

శ్రీ నిధి గారి హృదయం ఎంత నిర్మలంగా ఆలోచించిందో మనకు ఈ క్రింది వాక్యాల వలన తెలుస్తుంది. ఎందుకంటే ఆయన ఒక కవితా విప్లవాల మధ్య కొట్టుకు పోకుండా నెమ్మదిగా ఆలోచించి, తన నిర్ణయాన్ని ఘంటా పథంగా చెప్పారు. ఆయన అతి చిన్న వయసులోనే ఈ భావ శిఖరారోహణకు చేరడం అభినందించ వలసిందే.

'సంఘ దురాచారాలు
సంకుచిత భావాలు
ప్రతి హృదయాన్ని విడిచిపోయే వరకు
కూలివాని చెమటతో
మానవతా కలంతో
కన్నీటిలో శుద్ధపరచిన
చెలరేగే విప్లవ కవితే వ్రాస్తాను' అని అన్నారు.

ఈ కవితా విప్లవాల మధ్య వచ్చిన మార్పు వలన మనకు ఎంతో మంది మంచి కవులు కూడా వచ్చారనడానికి నిధి. అలిశెట్టి ప్రభాకర్ లాంటి వారిని చెప్పుకొనవచ్చును

ఈ విధముగా వచ్చిన ఆ దశాబ్దం కవితాయురికి, సంకలనాలకు అతి వాస్తవికతకు ఈ మలుపు మూలాధారమని కూడా చెప్పవచ్చును. ఈ కవితల్లో దిగంబరత్వం ఉంది. విప్లవ కవిత్వం ఉంది, అభ్యుదయ కవిత్వం ఉంది,

(**1-12-81** సమాలోచన పక్ష పత్రిక (రాజమండ్రి) లో వచ్చిన వ్యాసంను స్వల్ప మార్పులతో పరిచురితము),

# సాహిత్యంలో రచయిత బాధ్యతలు-విలువలు

"సమాజం పట్ల రచయితకున్న బాధ్యత ?" అనగా అవసరమూ, ఉన్నతమూ అయినది ఉందని ఒకవేళ మాటవరుసకు అంగీకరించినా, ఏకపక్ష బాధ్యతలుండ నేరవు? సంఘానికు రచయిత పట్ల బాధ్యత ఉండి తీరాలి. "హక్కులూ, బాధ్యతలూ అనేవి బొమ్మా బొరుసు వంటివి "అని శ్రీ గోరా శాస్త్రి గారు "మారుతున్న విలువలు-రచయిత బాధ్యత" అనే వ్యాసంలో పై విధముగా చెప్పారు. కాబట్టి రచయిత కేవలము తను ఊహించింది రాసిపడేయడం కాకుండా, ఆ రచన వలన పాఠకులపై ఏదైనా ప్రభావం కలిగిస్తుందా ఆలోచించాలి. ఒక రచన మంచి ఆదరణ రాగానే అదే మూసలో పండించి వదలిపెడితే అది పాఠకునికి ఉపయోగపడకపోగా అతను సరిగా చెప్పలేకపోవచ్చును. అంటే మనకు స్థూలంగా ఈ సందేహాలు రావచ్చును.

రచయిత బాధ్యత పాఠకుల మనస్తత్వాన్ని బట్టీ ఉంటుందా ? లేక రచయిత పాఠకులను మారుస్తాడా ? లేక పాఠకులే రచయితను మారుస్తారా ? లేక ఒకరినొకరు మారుస్తారా? అని అనుకుంటే ఎవరూ ఎవర్ని మార్చరా అనే సందేహం కూడా వస్తుంది. అప్పుడప్పుడు కేవలం రచయిత ఉబుసుపోక రచయితగానే మిగిలిపోతాడు. ఈ రచయిత వలన సమాజానికి ఉపయోగం లేకపోగా చాలా కీడు జరుగుతుంది. అంటే సంఘ సంస్కర్తలకు రసవంతమైన సాహిత్యాన్ని సృష్టించాల్సిన బాధ్యత లేనట్లే రచయితలకు కూడా సంఘాన్ని సంస్కరించాల్సిన బాధ్యత లేదు అని శ్రీ సంజీవ్ దేవ్ గారు అన్న మాటలు మనం మననం చేసుకోవలసి ఉంటుంది.

ఆధునికుడు అయిన రచయితయే కానీండి, కవియే కానీండి, విమర్శకుడే కానీండి ఎలా తయారు అవుతున్నాడో మనం ఒకసారి పరిశీలిద్దాం.

"ఆధునికుడు జిరాఫీలా తయారవుతున్నాడు
రోజురోజుకూ అతని మెదడుకీ, హృదయానికీ
దూరమెక్కువై పోతుంది —" అన్న శ్రీ ఆరుద్ర మాటలు ఎంతో సహజంగా అనిపిస్తుందిక్కడ. ఎందుకంటే ఆపై వాక్యాలలో నిజముంది. నేటి ఆధునికుడు కేవలం తనకు తోచినది మాత్రమే రాస్తున్నాడు. కేవలం దానిని ఏ మాత్రం ఆలోచించకుండా మెదడుకు పని కల్పించకుండా హృదయానికి హత్తుకున్న దానిని హత్తుకున్నట్టుగా అందిస్తున్నాడు. దీనివలన తెలిసిందేమిటంటే రచయిత, కవి


టి. శ్రీరంగస్వామి

అనే వాడు బాధ్యతా రహితంగా తన ఇష్టము వచ్చినది రాసేసి దానినే "వేదము" అనే ధోరణిలో నడుస్తున్నాడు. ఇతరులు చెప్పినది విని అర్థంచేసుకోకుండా మెదడుకు హృదయానికి దూరమును పెంచుకుంటున్నాడని చెప్పవచ్చును.

యువ రచయితలు, కవులు కేవలం తను చెప్పదలుచుకున్న విషయాన్ని చెప్పడము కొరకు మాత్రమే ప్రయత్నిస్తున్నారు. కాని ఆ విషయం గురించి తర్జన భర్జన చేయడం కాని, అ విషయం పైన సమగ్రంగా విచారించడం ముఖ్యం అవడంతో మౌలికంగా అందులోని విలువలను గ్రహించక పోవడమే కాకుండా, వాటిను సమూలంగా నాశనం చేయటానికి పరోక్షంగా తోడ్పడుతున్నారు.

కేవలం మిడిమిడి జ్ఞానంతో రాసేస్తున్నారు తప్ప? రాసినదేమిటి? అని ఆలోచించే తీరికను చేసుకోవడంలేదు. కేవలం వీరు పేరు కొరకు, కుహనా మహారాజులకు సుబేదారులవలె వ్యవహరించడానికే తహతహలాడే రచయితలు వీరు అనుకోవచ్చును. అంతేకాదు సాహిత్య సభల వేదికలపైన ఉపన్యసించడానికి మాత్రమే అని అనుకుంటాడు, ఇంకా పత్రికల్లో పేరు చూసుకోవడానికి మాత్రమే ప్రయత్నిస్తుంటాడు.

రచయిత ఎవరికి బాధ్యుడు? అని ప్రశ్నించుకుంటే ఈనాటి రచయితకి పత్రికాధిపతులకు, ఆకాశవాణివారికి, పబ్లిషర్లకు సినిమా నిర్మాతలకు, అకాడమీల వారికీ బాధ్యుడు. తృణమో, పణమో డబ్బిచ్చి రచన కొనుక్కునే మహాశయుడు సాహిత్య విలువలను నిర్ణయిస్తున్నాడు. అతనికి కొంచెం నవీన భావాలు లేని నవ్య సాహిత్యాన్ని అదరిస్తాడు ధనార్జన- అదీ ముఖ్యం తొంభైశాతం రచయితలు సాహిత్యాన్ని వ్యాపారంగా మార్చి వేశారు. సాహిత్య సభల నిర్వహణ కూడా వ్యాపారంగా చేసుకుంటున్నారు. (రచన - యువభారతి)

''ఇంతమందిలోనూ సాంఘిక శ్రేయస్సు గురించి క్షణ క్షణం మారుతున్న జీవన విధానం గురించి, మధనపడే ఆమాయకుడు కూడా సకృత్తుగా ఉండవచ్చుగాని, అలాంటి విచిత్ర జీవికి ఆదరణ లేదు. సాహిత్య రచనా బేకారులు విచ్చలవిడిగా సంచరించి ''రథోత్సు'' వాయిస్తుంటారు. సాహిత్య రంగానికి తామే ట్రస్టీలమను కుంటారు.'' అని అన్న శ్రీ గోరాశాస్త్రిగారి మాటలలో ప్రస్తుత పరిస్థితులను చూసుకుంటే ఏకీభవించక తప్పదు.

రచయితలు తమ బాధ్యతలను తెలుసుకొని, సాహిత్యంలో విలువలను హరించి వేయకుండా, విమర్శకు గురికాకుండా తమ బాధ్యతను నిర్వర్తించి, రచనలను వెలువరించినప్పుడే ఆ సాహిత్యం కలకాలం నిలుస్తుంది. దానితోపాటు రచయితకూడా నిలదొక్కుకొనడానికి అవకాశం ఉంటుంది.

ఈమధ్య కాలంలో రచయితలలోనుండి కొంతమంది తమ సృజనా శక్తిలో లోపం ఉన్నదానిని కప్పి పుచ్చుకొనడానికి శ్రీ గోరాశాస్త్రీగారు చెప్పినటుగా "సాహితీ దళారులు''గా తయారు అవుతున్నారు. అంతేకాకుండా తమ పరిధిలోని యువ రచయితలను ఆకర్షించుకొని, వారిని ప్రలోభపెట్టి, వారితో సేవచేయించుకొని వారినుండి ధనమో, ఫలమో ఏదో రూపంగా తీసుకొంటున్నారు. "నాగొడ"లో శ్రీ కాళోజి నారాయణరావుగారు అన్న ఈ కవితా పాదాలను ఇక్కడ మననం చేసుకోక తప్పడం లేదు.

"విపణివీధి, తపోవనం
వాకిరేవు, శాసనసభ
సానికొంప, సాధుమఠం
మూత్రశాల, యాత్రిస్థలి
పోటీపడి, కాటులాడ
ఎచటైతేనేం —" అన్నది ఈనాడు సాహితీ సంఘాలలో, లోకంలో విలుప్తమౌతున్న నైతిక విలువలకు ఇది చిహ్నం.

అందేకాదు ఈ సాహితీ దళారుల మనస్తత్వము, వారి దృక్పథము, దృష్టి ఎలా వుంటుందో శ్రీ కాళోజీగారి కవితలోనే ఇలా సూక్ష్మంగా చెప్పుకొనవచ్చును.

"ఆకళ్ళ కళలు ఆకళ్ళు
ఆకళ్ళు కళల ఆకళ్ళ
ఆకళ్ళ కళలు ఆకళ్ళు
కలల ఆకళ్ళు ఆకళ్ళు

అందుకే రచయిత అయినవాడు తనబాధ్యత గుర్తించిప్రవర్తిస్తే ఎంతోముందుకు 'ఆగామి' అయి నడుస్తాడు. మనకున్న జీవితాన్నే చూడాలని అనుకుంటే విలువల అద్దం నందు చూడు. మనిషి గురించి తెలుసుకోదగింది - తెలుసుకోలేనిది కేవలం మనిషి యొక్క విలువలు మాత్రమే. ఈ విలువలు క్రియాప్రతిక్రియా రూపంలో వెలువడే ప్రవర్తనా జన్యాలు.

రచయిత బాధ్యత తమ చెప్పదలుచుకున్న విషయాన్ని స్పష్టంగా, సులభంగా అర్థంఅయ్యేటట్టుగా సన్నివేశాలను అద్దంలా ప్రతిబింబింప చేయాలి. అంతేకాదు వాస్తవాన్ని మనకు కనిపింపచేయాలి అన్నమాట కేవలం రచయిత తను చూస్తున్న సమాజంను చుట్టూ ఉన్నదానిని మనకు రచనలో ప్రతిబింబింపచేస్తే సరిపోదు ఈ జీవిత చిత్రణఎట్లా

ఉండాలి, ఆ సంఘటనకు జరిగిన మౌలికాంశాలు ఏమిటి అనేది కూడా పరిశీలించి దాని సొల్యూషన్ అనేది చూపాలి. కనుక వాస్తవిక మైన విషయాలను పరిశీలించక కేవలం తను ఊహించి రాసినచో అవి కేవలం ఊహాగానంగానే మిగిలి పోతాయి, అవి "వ్యర్థం" గానే ఉండి పోతాయి.

"హృదయం అగోచరం
మనస్సు అగమ్యం
వాక్చిత్రణ అసంబద్ధం
స్పందన అసంపూర్ణం
భావం అస్పష్టం
అయినా నేను........
కవితను పూరిస్తాను"

"-వ్యర్థ" – శ్రీరంగస్వామి టి.

అందుకొరకు రచయిత గాని, కవిగాని 'వ్యర్థ' మైన ప్రయోగాలు చేయకుండా పాఠకులకు కనిపించని వాటిని కూడా వెలికితీయాలి, తీసి వాటిని అందించినప్పుడే తమ బాధ్యతను సక్రమంగా నిర్వర్తించ గలుగు తాడని చెప్పవచ్చును.

'ఏమైనా జీవితాన్ని సమగ్రంగా దర్శించడమూ, జీవిత వైవిధ్యాన్ని గుర్తించి స్పందించడమూ చాలా అవసరమేమో అనుకుంటాను. పాక్షిక వాదులు జీవితంలో ఒక వైపే, ఒక భాగాన్నే చూసి, ఎంతో విశిష్టమైన అనుభూతి, ఆదరణని "Miss" అయిపోయారేమోననిపిస్తుంది అన్న శ్రీ తిలక్ గారి మాటలతో ఏకీభవిస్తున్నాను.

సాహితీ రంగంలో కృషి చేస్తున్న ప్రతి యువకుడూ, తనకంటూ ఉన్న బాధ్యతను విస్మరించకుండా, సాహితీ విలువలు లుప్తమైపోకుండా, తను కృషి చేస్తూ ఇతరులకు మార్గదర్శకుడు కావాలని కోరడంలో ఏమాత్రం అత్యాశ లేదని అనుకుంటున్నాను.

# వచన కవిత్వంలో వాస్తవికత

ఆధునిక సాహిత్యంలో వచన కవితకు ఓ ప్రత్యేకత అయిన స్థానముంది. కవితల్లిడంలో వాస్తవికత ప్రతిబింబింపచేయడం ఒక కళ. ఆ కళను సమర్ధవంతంగా పోషించి కవిత ద్వారా సమాజంలోని తుప్పును, సాంఘిక పరిస్థితులను తేటతెలం చేయడం జరుగుతుంది. వాస్తవికత అంటే ఉన్నదున్నట్టుగా చెప్పడం కాదు, కవిత్వం ఏమాత్రం అసహజత్వంతో కూడుకోకుండా కవిత్వ ధోరణిలో పాఠకుడి మనః చక్షువులకు సోకకలగాలి అప్పుడే పాఠకుడు ఆ కవిత్వంలోని సొబగులను, యదార్థాన్ని గ్రహించి వాస్తవికత వైపు దృష్టిని మళ్ళించగలడు కవి తను చెప్పదలచుకున్న విషయాన్ని స్పష్టంగా అవగాహన చేసుకున్నప్పుడే తన కవితలో వాస్తవికతను ప్రతిబింబించగలడు. లేదా ఆయన చేసిన ప్రయోగం తుస్సుమని పేలిపోగలదు. దీని వలన పాఠకుల దృష్టిలో కవి చులకన అవడానికి తనకు తానుగా అవకాశం కల్పించుకొనిన వాడు అవుతాడు. వాస్తవికతను ప్రతిబింబింప చేయబోయే వచన కవితా రచయిత చాలా జాగ్రత్తగా తన కలంను కత్తిమీద సాములా నడుపవలసి ఉంటుంది. ఈ వాస్తవికతను చూపెట్టె రచయిత తను వేసే అడుగు కూడా చాలా జాగ్రత్తగా వేయాలి. సామాన్యంగా రచయిత చెప్పేది ఒకటి, చేసేది ఒకటి ఉంటుంది. అలా జరిగిన ప్పుడు రచయిత వాస్తవికతను ప్రతిబింబింప చేయలేడు. చేసినా అది కృత్రిమంగా ఉంటుంది. కృత్రిమత్వంతో సృజించిన కవిత కొద్ది కాలమే నిలిచిపోతుంది. ఆ తర్వాత నామరూపాలు లేకుండా పోతుంది, అలాగే కృత్రిమత్వంతో అందించిన రచయిత కూడా. రచయిత వాస్తవికతను తన కవిత్వంలో జోడించినప్పుడు అతను కూడా ఆ వాస్తవికతకు స్పందించాలి.

వచన కవిత్వంలో "వాస్తవికత" అనే అంశమును వెదకడం ఎంతో సాహసమైన విషయం. ఎందుకంటే వచన కవిత్వం ప్రయోగముగా ప్రారంభించబడి నేడు సాహిత్యములో సుస్థిరమైన స్థానాన్ని ఏర్పరచుకొని అది చెప్పదలచుకొన్న విషయాన్ని స్పష్టంగా చెప్పడానికి ప్రయత్నం జరుగుతూనే ఉంది. అయితే వచన కవిత్వంలో రచయిత తన భావాన్ని అస్పష్టంగా చెప్పి పాఠకుని తికమక పెట్టడం కూడా కద్దు. వాస్తవికతను ఈ క్రింది విధముగా మనము విభజించుకొన వచ్చును.

అ) వాస్తవాన్ని వాస్తవంగా చెప్పడం

ఆ) కవితను పూర్తిగా కవిత్వ స్థాయిలో వాస్తవాన్ని కవిత్వీకరించడం

ఇ) వాస్తవాన్ని అదర్శీకరించడం (సంఘటన ఫలితం) సిద్ధాంతపరంగా



టి. శ్రీరంగస్వామి

ఈ) వాస్తవాన్ని ప్రతీకగా చెప్పడం

ఉ) వాస్తవాన్ని ఉపమానంగా అందచేయడం

ఊ) స్తబ్ధతతో కూడిన కవిత్వం చెబుతూ అందులో నిత్యం కనిపించే వాస్తవికతను క్రోడీకరించడం కూడా జరుగుతుంటుంది అప్పుడప్పుడు.

ఈ నాడు ఎందరో రచయితలు తమ కళ్ళ ముందు జరుగుతున్న సంఘటలను నేత్రంలో కదిలిన చిత్రాలకు అక్షర రూపంగా మలిచి మనముందుంచుతున్నారు.

మన తెలుగు సాహిత్యంలో వాస్తవికతను క్రోడీకరించుకొని వచ్చిన కవితలు కొద్ది వాస్తవికతా వాదముతో వాస్తవికతను ప్రతిబింబించుకొని వచ్చిన కవితల సమాజాన్ని జాగ్రిదావస్థలోనికి తీసుకొని రావడానికి అవకాశం ఉంటుంది.

స్తబ్ధతతో కూడిన కవిత్వం చెబుతూ వాస్తవికతను క్రోడీకరించటంలో ఎలా ఫల్యం చెందారో ఈ క్రింది కవితల్లో మనం గ్రహించ వచ్చును.

"సగం జీవితం
చదువులవేటలో
మిగిలిన సగం
ఉద్యోగాన్వేషణలో
నేడు ప్రియత్నం
వృద్ధాప్య పింఛనుకై
అదీ రాకముందే
రాలిపోవుట ఖాయమనుకో."

—"ఆత్మకథ" శీర్షిక – నిధి

"అమ్మా! కుంటోన్ని
పోయిరా!
తల్లీ గుడ్డోన్ని
వెళ్ళిరా!
మా తల్లీ ముసలోన్ని
పో! పో!
ఏడుకొండల వాడా
వెంకటరమణా
వస్తున్నా ఉండు!"

—బోయ జంగయ్య

కేవలం సహజంగా జరిగే ఒక సంఘటన తీసుకొని ప్రతిబింబింప చేస్తూ, సమాజాన్ని విమర్శించే పద్ధతి ఎంతో చక్కగా గుండెపై హత్తుకుంటుంది.

వాస్తవాన్ని వాస్తవంగా చెప్పడం ఎలా జరుగుతుందో ఇక్కడ చూడండి.

" ఒక్కడై సాధించాడు
మహాత్ముడు
స్వాతంత్ర్యం మన కోపం
మనమంతా కలిసి
సాధించలేక పోతున్నాం
శాంతి.... ....
ఆయన కోసం"

—'సిగ్గు సిగ్గు' శీర్షిక —ప్రస్వాతి

"కూలివాడు చూసేది
నీ అంతస్తు పైపుకాదు!
ఆ కళ్ళు వెతికేది
నీ ఇనుప పెట్టెకై కాదు ...
అబ్బా.... నాలో....
ఇంతటి నైపుణ్యం.... ఉందా....!
ఇదినేను! ఇటుక పేర్చిన
ఆనంద భవన మేనా
అన్న....
ఆశ్చర్యంతో !

—'ఆశ్చర్యం' శీర్షిక —భండారు విజయ

"తలెత్తుతున్న ఏర్పాటు ఉద్యమాల్లా
గంతలు పడ్డ రోడ్డు
దేశపు కుహనారాజకీయాల్లో
కుళ్ళి కంపు కొడ్తే మురికి కాల్వ
నాయకుల వాగ్దానాల్లా పేరుకుపోయిన
మున్సిపాలిటీ వారి చెత్తబుట్ట
ఏదో చేయాలంటు చేయలేని

సగటు భారతీయుని ఆశయాన్ని
ఎగతాళి చేస్తూ వెక్కిరించే రాతలు
అసహ్యించుకొంటున్నా.........
రోజూ అదే దారి వెంటనా దినచర్య"

–'పుటాకార దర్పణం' శీర్షిక –నిధి

వాస్తవికతను కళాత్మకంగా రూపుదిద్దటం వలన, కవిత్వ స్థాయిలో కవిత్వీకరించడం వలన ఒక్కోసారి వాస్తవికత తెరచాటున పడుతుంది, అందుకు ఉదాహరణగా

'నా కళ్ళు రెండు అయినా
రెండు మహా సముద్రాలు, నా కనుగోళాల్లో
బడబాగ్ని జ్వాలలతో జ్వలిస్తూ, ఉత్తుంగ తరంగాలతో
హోరెత్తిస్తున్నవనీ తెలుసు

–ప్రయోజనం శీర్షిక కీ॥ శే॥ శ్రీమతి శశిసుభాష్

"అత్తింటికి వెళ్ళే నవ వధువు
ఆకుపచ్చని నైలాన్ తెరల మధ్య
పట్టుకుచ్చుల బంగారు మొక్కజొన్నపొత్తు
అసహాయంగా పుట్టిల్లు జేరిన అబల
అత్త ఆడపడుచులు రాజేసిన
వరకట్నపు బొగ్గుల కుంపటిలో
అటుఇటుతిప్పి, త్రిప్పి కాల్చినకంకి

"వధువు" శీర్షిక – టి. రామసీతమ్మ

వాస్తవాన్ని ప్రతీకగ చెప్పడం కూడా ఒక పద్ధతి మొట్ట, మొదటగా ఈ ప్రతీక వాదాన్ని ఆరుద్ర గారు తమ "త్వమేవాహమ్, సినీవాలి" లల్లో ప్రతిబింబించారు. ఈ ప్రతీక వాదాన్ని ఆధునికులు ఎలా ప్రయోగిస్తున్నారో చూడండి.

'కడుపు నిండ ఆకలితో
కళ్ళ నిండ ఆశలతో
చిత్తుతున్నారు, చిమ్ముతున్నారు
పందులతో పోటీ పడుతూ, సరిసమానంగా
రేకు ముక్కో, సీసపక్కో, కాగితపు తుక్కో.

దొరికినప్పుడు ఈ దేశాన్నే గెలిచినంత
ఆరాటంగా కేరింతలు వేస్తున్నారు, అరుస్తున్నారు'

-'పెంటకుప్పలు' శీర్షిక -నిధి

'పెద్ద దేశాల చరిత్రల వలె గొప్పగా
పదిమందితో పంచుకొనేంతగా, ఘనంగా
పవిత్రంగా లేదు జీవితం ... ....'

-'జీవితం' శీర్షిక -కీ॥ శే॥ శ్రీమతి శశిసుభాష్

'బస్సు వైపు పరిగెత్తే ప్రజలను
పరిగెత్తే బస్సుకు వ్రేలాడే ప్రయాణీకులను
చూస్తుంటే.... ....
అనిపిస్తుంది ఆకర్షణ
భూమికే కాదు
ఆర్.టి.సి. బస్సుకూ ఉందని'

-'ఆకర్షణ' శీర్షిక 'ప్రస్వాజి'

"ఆశానిరాశల మధ్య
ఊగిసలాడుతున్న యౌవనం
చీకటిలో.... ....
గాలిదుమారాల మధ్య
వెలిగించిన "కొవ్వొత్తి"లా ఉంది

-యౌవనం శీర్షిక -టి. శ్రీరంగస్వామి

వచన కవితలో ముఖ్యంగా వస్తు ప్రాధాన్యత చోటు చేసుకొని, వాస్తవికతను ప్రతిబింబించడం జరుగుతుంది. ఈ ప్రతిబింబమే సమాజ దర్పణం. వచన కవితలో ఎన్నో ప్రయోగాలు చేసి, ఎన్నో కవికలు అందించి, అందరు ఒక వేదిక మీద కూర్చుండి మెప్పించుట పేర్కొనదగినది.

డా॥ సి. నారాయణ రెడ్డి గారు తమ 'సమదర్శనం'లో చెప్పినట్లు వచన కవిత్వం బహుముఖాలుగా వర్ధిల్లుతుంది అని నిస్సందేహంగా చెప్పుకొనవచ్చును.

'క్రొత్త నీటిని జేర్చుకొని తర
గెత్తు నది వలె ఏట్టి జాతియు
ముందు కేగినంత కాలము
మూడు పూవులు, ఆరు కాయలు'' అవుతుంది.

# వచన కవిత్వంలో మానవతా సిద్ధాంతం (త్రికరణశుద్ధి)

వచన కవిత్వంలో అభ్యుదయ వాదం, ప్రణయతత్వం, మానవత్వం, వైరాగ్యతత్వం, వాస్తవికత, సామాజికస్పృహ, నిరాశావాదం, పాజిటివిటీ, సంప్రదాయకత, ప్రకృతి చిత్రీకరణ, అనుభూతి వాదం జాతీయత మొదలగునవి ప్రతిబింబింపచేస్తున్నారు కవులు తమ కావ్యాలలో. మన తెలుగు సాహిత్యంలో కొందరు కవులు "మానవ సిద్ధాంతాన్ని'' ప్రతిబింబించారు. ఈ మానవత సిద్ధాంతంనే 'మానుష స్వచ్ఛతారీతి' అని అనవచ్చును. "మానుషస్వచ్ఛతారీతి" అనగా త్రికరణశుద్ధిగ చెప్పడం. ఆలోచన, మాట, ఆచరణలు కలిపి చెప్పడం అన్నమాట.

మాటలలో రాతలలో ఎంతైనా మానవతా సిద్ధాంతాన్ని చెప్పుతూ ఆచరణలో అంతా దానికి వ్యతిరేకం చేస్తే అరాచకం తప్పదు. కావున ఏ పని చేసినా త్రికరణ శుద్ధిగా చేయడం సామాజికులకు అవసరం

"ఎవరనుకున్నారు?
చేతకు సిద్ధాంతానికి
చీమ, ఏనుగు తేడాయని
వటసావిత్రీ వ్రతము
వారకాంతము చేస్తుందని''

—నాగొడవ '—ఎవరనుకున్నారు ఒట్లానని?' శీర్షిక

'నాగొడవ లో శ్రీ కాళోజీ చేతకు—మాటకూ ఉండే తేడాని వివరిస్తాను. అంతే గాకుండా ఒక్కొక్కసారి మనుష్యులకు ధనము రాగానే వారి ప్రవర్తన ఎలా మారిపోతుందో? పై కవితలోనే ఇంకా ఇలా చెప్పుతున్నారు.

'సత్తా రాగానే కన్నులు
నెత్తి కెక్కిపోతాయని
త్యాగులు సైతం గడియలో
భోగ్యులయ్యి పోతారని

'ఎవరనుకున్నారు?' —దాని వలన వారు అంత వరకు చెప్పింది నట్టేట్లో ముంచి పారేసారన్న మాట. మంచి మాటల్ని చెప్పడం ఒక్కటే సమాజంలోని సమస్యలకు పరిష్కారంకాదు. సిద్ధాంత ప్రబోధమూ, ఆచరణ రెండూ

ఒక్కటిగా వుండాలి. ఇలా ఉన్నప్పుడు మానవతలోని స్వచ్ఛతతో మల్లెపూలు పూయిస్తానని యువకవి "నిధి" ఇలా అంటున్నారు తమ 'స్పందన' కావ్యంలో

"త్యాగం చంద్రునితో
రాగం వెన్నెలలో
మానవతా తావినింపిన
సమానత్వపు మల్లెలు పూయిస్తా"నని (పుట-31)

మానవతావాదన్ని మానుష (స్వచ్ఛతారీతి)న్ని తన కవితలో ప్రతిబింబించినవాడు తిలక్. తిలక్ భావకవితా, ప్రగతివాద కవితా ప్రభావాల నుండి వచ్చినవాడు. సామాజిక భావనా విషయంతో ఆయన ఒక గొప్ప మానవతావాది. మానవతాస్వేచ్ఛతను ఆయన కవిత్వంలో మనకు ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. ఈయన మానవతావాదములో ఆచరణ, ఆలోచన, మాటలను త్రికరణ శుద్ధిగా అమలు చేయని వారి నుండి మమ్ము లను రక్షించమని కోరుతున్నాడు. శ్రీ తిలక్‌గారు మన దేశంలో మూఢత్వంతో ప్రబలిపోయిన నమ్మకాలను. ఆ నమ్మకాల నీడల్లో సొమ్ము చేసుకొనే దళారీల నుండి ఈ మానవులను రక్షించుమని ఇలా కోరుతున్నారు.

"దేవుడా
రక్షించు నా దేశాన్ని
పవిత్రుల నుండి, పతివ్రతల నుండి
పెద్దమనుషుల నుండి, పెద్దపులుల నుండి
నీతుల రెండు నాల్కలు సాచి బుసలుకొట్టే
నిర్హేతుక కృపా సర్పాల నుండి
లక్షలాది దేవుళ్ళ నుండి, వారి పూజారుల నుండి
వారి వారి ప్రతినిధుల నుండి
సిద్ధాంత కేసరుల నుండి, సిద్ధుల నుంచి
శ్రీ మన్మద్గురు పరంపర నుండి"

-అమృతం కురిసిన రాత్రి -ప్రార్థన శీర్షిక పుట-107, నాల్గవ ముద్రణ

మానవుడిలో మానవతా వాదాన్ని చూసి అతడ్ని దేవుడిగా నమ్మాలి. అప్పుడే ఆ జాతి సమగ్రతకు నిదర్శనం అంటాడు. ఈ నిర్ణయానికి రానివాళ్ళను ఇలా అంటాడు.

"తమను తాము బంధించుకున్న సూత్రాలలోంచి, నమ్మకాలలోంచి
తప్పించుకోలేని మనుషుల నిస్సహాయ జీవితం
కొత్తదారి తొక్కలేని, కొత్త మలుపు తిరగలేని
కుంటి, గుడ్డి వాళ్ళ ప్రయాణ కోలాహలం"

– అమృతం కురిసిన రాత్రి – పుట 178

"అవివేకానికున్న బలం ఆవేశానికతికినప్పుడు
ద్విపార వాహనాలు బద్దలు తప్పి ప్రమాదించక తప్పదు.
అందుకే మానవుడు మానవుడిగా దేవుడిగా రూపొందే ఈ ప్రయాణం
అనంత దీర్ఘం పునః పునర్వ్యర్థం బహుయుగ విస్తీర్ణం"

– అమృతం కురిసిన రాత్రి – పుట 89

"సంకుచితమైన జాతి మతాల సరిహద్దుల్ని చెరిపివేస్తున్నాను చూడు
ఆకుంఠితమైన మానవీయ పతాకను ఎగురవేస్తున్నాను చూడు
చరిత్ర రక్త జలధికి స్నేహ సేతువు నిర్మిస్తున్నాను రండి
కవి వచస్పవిత్రకాంతి పూరమిది స్వేచ్ఛగా జలకమాడండి"

– అమృతం కురిసిన రాత్రి – పుట 80

ఈ మానవతా సిద్ధాంతాన్ని చెప్పిన మరొక కవి శ్రీ కోవెల సుప్రసన్నాచార్యులు గారు. అధునిక మానవుడు తను నిర్మించుకున్న విజ్ఞానాభివృద్ధిని ఎంచి ఎలా సంతోషిస్తున్నాడో నవ జీవన విధానము (యాంత్రిక మైన)లో మనమూ పయనిద్దాం రమ్మని పిలుస్తున్నాడు.

"ఎప్పుడో కట్టుకున్న చీకటి గోడల మీద
ఈ నీడలతో కప్పు వేసుకొని, ఆధునిక
ఆర్థిక సిద్ధాంతాల కిటికీలు త్రవ్వుకుని
క్రొత్తగా మనుష్యుల్లోకి వచ్చిన
అణుబాంబుల విద్యుద్దీపికలు ఏలిపి
అంధకారాన్ని అగ్నిగా రూపొందించి
ఇందులో హాయిగా నివసిద్దాం
రండరా!"

'చేతనావర్తం-1 పుట-5'

అయితే ఈ సమాజంలో నిజాయితీ లేని మానవులు జీవిత రంగంలో ఏయే రంగాల్లో, ఏయే వేషాల్లో ఉన్నప్పటికీ వాళ్ళ వల్ల జరిగేది ఒక్కటే అది లోకాన్ని తప్పుదారి పట్టించడం దీన్ని విరోధించి ఈ మానవతా సిద్ధాంతం శ్రీ సుప్రసన్నాచార్యులుగారు "చేతనావర్తం-2"లో ఎలా చెప్పారో చూడండి.

"యౌవనాన్ని మత్తేక్కట్లు తాగి
బోర్లపడేది పకా పకా నవ్వేది
నానాగడ్డి తినేది అయినా తాను
నియతాహారి వలె ఉపన్యసించేది
ఎత్తుగా ఎగర్లేక పోయినా మత్తుగా కూర్చుండి
ఎప్పుడూ సూర్య మండలాన్ని గూర్చే చెప్పేది
అందర్నీ మెప్పించడానికి
పల్లటీలు కొట్టేది అందంగా
పోయి వచ్చే బొల్లి గద్దకల్లా
వంగి వంగి నమస్కారాలు చేసేది
నీవే గరుడాళ్వారువని-''

చేతనావర్తం-2 (పుట 89)

ఇందులో (మానవతా సిద్ధాంతం) మానుష స్వచ్ఛతా రాహిత్యం వలన మనిషి ఎంత అప్రయోజకుడూ, వికృతుడూ అవుతాడో తెల్పడానికి, కనబడ్డవాళ్ళకల్లా తమ పనులవి సాధించడానికి దండాలు పెడుతూ వాడిని మహాపురుషుడుగా చిత్రీకరిస్తాడు. నిజాయితీ లేనివాడు-తాను ఎత్తుగా ఎగరలేడు. ఎప్పుడూ తాను స్వచ్ఛంగా ఉన్నట్టు ఉపన్యసిస్తాడు, అంతేకాదు సూర్యమండలాన్ని గురించే మాట్లాడుతాడు. వాడు ఇంకా ఎలా ఉంటాడో ఇలా చెప్పుతారు.

దేశం కంటే తాను గొప్ప - ఆహారపు కొరత లేదు
యోగుల్లో తాను పెద్ద - భార్యతో ఎప్పుడూ పోట్లాట
తననుగూర్చి ఎవరేమన్నా విమర్శించినా
తనకు పట్టదు, తన గుండెలకు గిట్టదు'

చేతనావర్తం-2 పుట-85

ఈ మానుష స్వచ్ఛతా సిద్ధాంతాన్ని తమ కవిత్వంలో సూచించిన మరో కవి శ్రీ కోవెల సంపత్కుమారాచార్యులుగారు. సాంఘిక శ్రేయస్సు, సాంఘిక దృక్ప

థము ముసుగుతో మానవుడు స్వార్థముతో చేస్తున్నపనిని ఈయన ఎలా దుయ్యబట్టారో చూడండి.

"ఇకనైనా ఆగవయ్యా ఘనుడా!
ఇంతవరకు చేసింది చాలు-
ఈమాత్రంగానైనా మమ్మల్ని బతుకనీ,
నెత్తికొట్టింది చాలు-
మొగంమీద కొట్టిందీ చాలు-
వీపుమీదా కొట్టింది చాలు
కడుపుమీద మాత్రం కొట్టకు
కడుపు నింపుకొన్న ఘనుడా!
మా పాలిటి జలముచుడా!"

— చేతనావర్తం-1 పుట-51

మానుష స్వచ్ఛతా సిద్ధాంతము మానవతా సిద్ధాంతములో స్వార్థంతో ఇతరులను తన సిద్ధాంతముతో, నీతులతో మాటలపేటికలను అందించి తను మాత్రం ఆ మానవతా సిద్ధాంతానికి దూరంగా ఉండడాన్ని నిరసించారు ఇలా -

"అందుకే ఒక అభ్యర్థన
అయోమయపుటడవిలోంచి
రా, ఇవతలకి
అందర్నీ కలుసుకో, మెలుసుకో
ఆలోచన అందించిన
స్పష్టత్వం పుచ్చుకో
ఆయాసం తీర్చుకో
కాలు మార్చుకో"

(చేతనావర్తం-1)

ఆలోచన, మాట, ఆచరణలను, కలగలుపుకొని మానవతా సిద్ధాంతాన్ని త్రికరణ శుద్ధిగా పాటించమని చెప్పుతున్నారు. వసుధైక కుటుంబంలో నీవొక పాత్రధారుడవని మర్చి పోవద్దని హెచ్చరించారు. వసుధైక కుటుంబం అని చెప్పుతూ ప్రజల కళ్ళల్లో కారంకొట్టి తాము తమ ప్రయోజనాల్ని సాధించు కొనడం జరుగుతుందని ఇందులో హెచ్చరించారు.

మానవ స్వచ్ఛతావాదం (మానవతావాదం) త్రికరణ శుద్ధిగా అమలుచేయడం అనేది ఎంతో అవసరం. అయితే వ్యక్తి వ్యక్తికి భేదం ఉంటుంది ఆచరణలో అది అసాధ్యం 'త్రికరణ శుద్ధి'ని అనుకరించి ముందుకు కదలడం ఎంతో కష్టమైనది, మానవ స్వచ్ఛతావాదాన్ని ఆధునికులు కూడా తమ కవితల్లో ఎలా చెప్పుతున్నారో చూడవచ్చును.

"చీకటిలో నిదురించే గుడ్లగూబకు
సూర్యుడంటే భయం
ఎందుకంటే_
అతడు_
కాంతి వర్షము కురిపించి
క్రాంతిని పండిస్తాడు"

(బి. రాములు–శింజనీశింజానము పుట-14)

స్వార్థపరుల నుండి మానవుడు మానవతా వాదముతో అందులో నుండి క్రాంతి దర్శనము కష్మని ఆశిస్తున్నాడు. ఇంకొక కవి శ్రీ జె. శివరామకృష్ణ ఇలా అంటున్నాడు.

''మనిషి కోసం మమత కోసం
మానవతా పూర్ణ సమత కోసం''

(మనిషి నానేస్తం పుట-43)

మానవతా సిద్ధాంతంను మనం అక్కడక్కడ కావ్యాల్లో చూడవచ్చును నిశిత పరీక్షను కావించినప్పుడు. అయితే నా ఈ ప్రయత్నం ఎంతవరకు సఫలం అయిందో విజ్ఞులైన మీరే గ్రహించండి.

"స్నేహం నీడనిచ్చే చెట్టులాంటిది"

# అభినందన చందనం

మీరు టి. శ్రీరంగస్వామి I అంటే ఒక I కాదు! ఇటు కవిగా వ్యాసరచయితగా విమర్శకులుగా, అటు కార్యకర్తగా చేపట్టిన ఆలోచనని చేసి చూపెట్టే దక్షా దక్షులుగా ఒక I లో అనేకం పరిశ్రమిస్తూ, ప్రతిబింబిస్తూ సందర్శిస్తున్న మీలో బహు పాత్రలు పోషించిన, పోషిస్తున్నమే I శ్రీరంగస్వామిని చూస్తున్నాను.

మీరు ఆత్మీయంగా పంపిన మధుర కవితా సంపుటి అందుకున్నాను! కవితలు చదివి అనుభూతి చెందాను. ఇప్పటికి మీరు వూదిన వాక్యాల వేణువుల భావ రాగలహరి ఒళ్ళి స్పృశిస్తూనే వున్నాను!

'కప్పిచెప్పేది కవిత్వమైతే విప్పి చెప్పేది విమర్శనం' అన్నారు నవ్య కవితా నయాగరా ఆచార్య సి. నారాయణ రెడ్డిగారు ఆ రెండు పాత్రలు సమంగా సౌమ్యంగా నిర్వహిస్తున్న మిమ్మల్ని అభినందిస్తున్నాను. మీ కవితల్లో మేఘాలు చీల్చుకొచ్చే మెరుపులున్నాయి. ఒళ్ళు విరుచుకునే మెరుపుల ఉరుములున్నాయి. పసిపాదాల ఉరకలున్నాయి! పసిడి మువ్వల సవ్వడుల వెలుగు నురగలున్నాయి। మరో కవితలో తనకు తప్ప ప్రక్కవాడికి కూడా వినిపించని సగటు మనిషి నిట్టూర్పులున్నాయి। కొన్ని దృశ్యాల్ని చూసి ద్రవించిన సజల నేత్రాలు మూల్గుతున్నాయి। ఇంకో కవితలో మొదటరాత్రి కొత్త పెళ్ళికూతురు మొదట ఆబ చచూశాక విరిచిన మెత్తని ఒళ్ళు విరుపులున్నాయి। ఒక కవితలో ప్రథమ చికిత్సఉంది. మీకు ప్రజల నాడి తెలుసు- నాడివేడి తెలుసు మీ కవిత్వాన్ని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను।

"మధుర" కావ్య రచనకు ప్రోత్సహించిన వారితో బాటు పోస్ట్‌మాన్ సేవలను కూడా గుర్తించుకొనడం, మీ సుహృదయతని మీటుతోంది. సన్నేహతత్వాన్ని చాటుతోంది। కవిత్వం వ్రాయడానికి పెద్ద డిగ్రీలేం అక్కర లేదనుకుంటాను। హృదయ స్పందన భాషపై శబ్దాలపై అధికారం, భావ వ్యక్తీకరణం యివి చాలనుకుంటాను మిత్రమా।

మీ కొత్త రచనకు స్వాగతం చెబుతున్నాను। కవిగా, సమీక్షకులుగా వున్న మీరు వ్యాస "విపంచి"ని వినిపించ బోతున్నందుకు ఆనందిస్తున్నాను।

అంతరంగంలో ఆత్మీయతని రంగరించుకున్న శ్రీ రంగస్వామి గారూ। మీరు ఏ ఆలోచన చేసినా, ఆలోచనని ఆచరణలో చూపినా రంగ రంగ వైభవంగానే

ఉంది! వుంటోంది! వుంటుంది అని వాదిస్తున్నాను! మీకు 'చందన' హారి చందనా లందిస్తున్నాను!

—మీ, వి. పి చందన్‌రావు విజామాబాదు.

*   *   *

సాహితీ రంగంలో అవిరళ కృషి సాగిస్తూ. కళావాణి గళసీమకు మరో మాలగా, "విపంచి" వ్యాసమాలికను అందించడం ఆనందదాయకం. కేవలం రచనలు చేయడానికి కాలం వెచ్చించక, అనేక సాహితీ మిత్రులతో బాంధవ్యం కలుపుకుంటూ, కార్యక్రమాలు నిర్వహిస్తూ, ఎందరో ఔత్సాహికులకు ప్రోత్సాహిస్తున్న మీరు మరింతగా ఎదుగాలని, క్రొంగొత్త బాటలు వేవకాలని, ఆ బాటలు ముందు తరాలకు మార్గదర్శకం కావాలని హృదయ పూర్వకంగా ఆశిస్తూ, అభినందనతో—

—మీ, గరిశకుర్తి రాజేంద్ర, కామారెడ్డి

•   •   •   •

సాహితీ పిపాసువులు, జిజ్ఞాసువులు, ఆధునికులు, రచయితలు, విమర్శకులు అనేక సాహితీ సంస్థలతో సంబంధం ఉన్న మీరు అప్పుడప్పుడు వ్రాసిన అమూల్య సాహిత్య విమర్శనా వ్యాసాలను "విపంచి" వ్యాస సంపుటిగా వెలువరించి పాఠక లోకానికి అందించిన మీ సాహితీ కృషి ప్రశంసనీయము.

—మీ, యం. వరదాచార్యులు, నర్సాపేట

*   *   *   •

సాహితీ సన్మిత్రులు శ్రీ శ్రీరంగస్వామి గారు చేయి తిరిగిన రచయిత, ప్రతిభ గల సమీక్షకులు, సాహితీ కృషీవలులు. వీరి రచనల్లో స్వంతవాణి, స్వంత బాణి గోచరిస్తాయి. వీరి మధుర కవితా సంపుటి' మధురానుభూతి నందించింది. వివిధ పత్రికలలో వెలువడినది సాహితీ వ్యాసాలు విజ్ఞానదాయకంగా వినూత్నంగా సాగేయి. ఈ సత్యాన్ని పఠితలూహించగలరు. సాహితీలోకానికీ వ్యాసాలుపకరిస్తాయని నా ఆకాంక్ష. నా హార్దికాభినందన చందనాలు.

—మీ, బెళ్ళపిళ్ళ సన్యాసిరావు, గుళ్ళసీతారాంపురం, శ్రీకాకుళం

కవిత్వం రాయటం విశిష్ట వ్యక్తిత్వం అయితే, విమర్శ చేయటం విలక్షణ తత్వం. కవిత్వం సృష్టించటానికి రస దృష్టికావాలి, విమర్శ చేయటానికి లోచూపు కావాలి. కవి విమర్శకుడు కావాలని నియమం లేదు. కానీ విమర్శకుడైన కవి యొక్క సృజనాత్మకత రసజ్ఞ పాఠకలోకాన్ని ఆలోచనా నిమగ్నం చేయగలుగుతుంది. ఆలోచన లేని ఆవేశం వ్యర్థం.

ఆప్త మిత్రులు, యువకులు శ్రీ టి. శ్రీరంగస్వామి గారి వ్యక్తిత్వంలో కవిత్వం వుంది, తత్వంలో విమర్శవుంది. వారు అసంఖ్యాకంగా సృష్టిస్తున్న కవితలు, విమర్శలు, సమీక్షలు నవతరాన్ని విశేషంగా ఆకర్షిస్తూ, మహోజ్వల మణి దీపాలుగా వెలుగొందుతున్నాయి. సరసకవులకు, సద్విమర్శకులకు శ్రీరంగస్వామి గారు మార్గదర్శకులు కాగలుగుతున్నందుకు అనురాగ హృదయంతో అభినందన చందనాన్ని అందిస్తున్నాను!!

—మీ, ఆచార్య భావన్

◆ ◆ ◆ ◆

మిత్రమా!

మీరు వ్రాసిన వ్యాసములు నన్ను చాలా ఆకర్షించినవి. మీ వ్యాసములకు వ్యాసము నేర్పరచి వ్యాస కళా కౌశలత్వమును నిర్ణయించుట సద్విమర్శకులైన సాహితీ వేత్తలకు నిజముగా ఒక పరీక్షవంటిది అని నా అభిప్రాయము.

వచన కవితలు వ్రాయుటలో వాసికెందిన లేఖిని-హస్తకులని మీరు వ్రాసిన 'మధుర' కవితా సంపుటి తెలియజేయుచున్నది.

ఇకపోతే సమీక్షా పూర్వకముగా మీరు వ్రాసిన వ్యాసాలకు తిరిగి సమీక్ష ఏమిటి? అని భావిస్తున్నాను. ప్రచురింపబడిన మీ వ్యాసాలు చక్కని వ్యాసాలు. ప్రశస్తము ప్రశంసనీయమగు శైలిలో హృద్యమంగా వ్రాయబడినవి. వ్యాసాలకు భావము, భాష ప్రధానంగా ఉంటూ శైలి సరళముగా, సుబోధకముగా నుండవలెను. ఇట్టి సరళము, సుబోధకమైన శైలి పఠితుల నాకర్షించును. ఇట్టి మనోహరమైన శైలి మీరు వ్రాసిన ప్రతి వ్యాసమునందున కలదు. వస్తు నిర్దుష్టతకు భావము, భాష మధుర మంజులములుగా నుండవలెను. మీ వ్యాసాలలో భావము, భాష ఈ రెండును మధుర మంజులములు.

మీరు "విపంచి" శీర్షికతో ప్రచురించుచున్న వ్యాస సంపుటి తన విపంచికా స్వరలహరులతో పఠితులనుయ్యాలలూగించుగాక!

—మీ, అద్దంకి రామానుజాచార్యులు
హిరమండలము, శ్రీకాకుళం జిల్లా

# పద్యత్రయ కానుక

కం॥ శ్రీరంగస్వామి: మీకను
లారంగను, చూచి విషయమంత వెలుగుమా
శ్రీరంగస్వామి వీవని
శ్రీరంగస్వామి యాన, చేర్తును విషయాల్॥

కం॥ పొంగెను సంతసమెంతయొ,
ఇంగితజ్ఞానంబుతోడ, నేవిడిదండాల్,
బంగరు సూక్తులు దెలిపిన
సద్గతికొండనుచు, సారెసారెకుదలతున్॥

కం॥ సారంగ రక్షుండున్ మరి
సారంగపురక్షకుండౌ, సర్వ విఘ్నములన్,
శ్రీరంగస్వామి యజ్ఞము
శ్రీరంగేశుండుగాచి, శ్రేయము లిడుతన్॥

ఇట్లు, భవదీయ శ్రేయోభిలాషి, మిత్రుడు

**అందలం జీవయ్య**

రిటైర్డు తెలుగు పండితుడు,
మెట్టుపల్లె
బనగానిపల్లె, కర్నూలు

15-1-86

టి. శ్రీరంగస్వామి
యం.ఏ.(తెలుగు); (పి.జి.డి.పి.ఆర్)

ఇం.నెం. 5-11-114/4
విద్యారణ్యపురి
వరంగల్లు - 506 009

ముద్రితములు :-

మధుర కవితా సంపుటి 1985
న.దా.రా. కవితాదర్పణం (సంపాదకత్వం)
విపంచి వ్యాస సంపుటి 1986
శిఖరం కవితా సంపుటి 1986

అముద్రితములు :-

కొత్తగడ్డ కవితా సమాలోచనం (వ్యాస సంపుటి)
వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సంచిక
వరంగల్లు నాటకరంగ చరిత్ర